# నయప్రదీపము - విగ్రహము.



(గద్యము.)

గ్రంథకర్త- కోరాడ రామచంద్రకవి.



కే. రామకృష్ణయ్య, యం. ఎ. యల్. టి., గారిచే

చెన్నపురి:

“ఆర్యభారతి” ప్రెస్సున

ముద్రించి ప్రకటింపఁబడినది.

1930



వెల రూ. 1.

# పీఠిక.

ఆంధ్రవాఙ్మయమునందలి గద్యశాఖ యిటీవలి కాలమున ననఁగా 19-వ శతాబ్ది మధ్యభాగమునుండి బయలుదేరినదిగాఁ దలంపఁ దగియున్నది. ఇంతకుఁబూర్వము, అనఁగా 17-18 శతాబ్దులయందు దక్షిణదేశమునందలి మధుర తంజావూరుప్రాంతముల నాయకతొండమాన్ రాజుల కాలమున బయలుదేరిన గద్యగ్రంథ సమితియంతయు సరస్వతీ భాండాగారమున గుప్తంబై మొన్న మొన్నటివఱకు నాంధ్రదేశమున నేమాత్రము ప్రచారము లేక యాంధ్రదేశీయులకుఁ దెలియని దగుటచే, 19-వ శతాబ్దిని నీదేశమున బయలుదేరిన గద్యగ్రంథములకు నాదక్షిణదేశగద్య వాఙ్మయమునకు నెట్టిసంబంధము లేకుండుటంబట్టి, యాంధ్రదేశమునందలి గద్యవాఙ్మయమున కాదక్షిణదేశవాఙ్మయము మార్గదర్శకంబైనదనిగాని యేవిధమైన ప్రోత్సాహముం గలిగించినదనిగాని చెప్పుట కేమాత్రము వీలు కనఁబడదు. కావున నాంధ్రదేశమందలి గద్యవాఙ్మయము దక్షిణదేశమందలి దానికంటె నూరు నూటయేఁబదిసంవత్సరముల తరువాత స్వతంత్రముగనే యేర్పడినదని చెప్పవలసియున్నది. ఏదేశమందుగాని పద్యవాఙ్మయముకంటె గద్యవాఙ్మయము చాల వెనుకబయలుదేరినట్లు తెలియవచ్చుచున్నది. ఛందోబద్ధములగు మంత్రములు ఏర్పడినతరువాతనే గద్యరూపములగు యజుస్సులు బ్రాహ్మణములు రచియింపఁబడినవి. గ్రీసురోము మొదలగు నితరదేశముల వాఙ్మయములందు నిట్టిక్రమమే గానవచ్చుచున్నది. జనులావేశరసపూరితులై యున్నప్పుడు వారిమనోవీథులఁబ్రవహించెడి భావప్రవాహము బహిర్గతమై వాగ్రూపమును బొందుసందర్భమున నది ఛందోబద్ధంబై తాళలయగతంబై పద్యరూపమును బొందును. జనుల కవితావేశమే పద్య కవితావిర్భావమునకుఁ గారణము. ఈయావేశముతగ్గి వ్యావహారికజ్ఞానము విమర్శనబుద్ధి జ్ఞానసంపాదనప్రతిపాదనా చింతయు హెచ్చినకాలముననే గద్యవాఙ్మయము ప్రబలుట కవకాశము లేర్పడు

చున్నవి. జనులు శాంతచిత్తులై వస్తుపర్యాలోచనకుఁ గడంగిన కాలమున గద్యవాఙ్మయము బయలుదేరును.—

"Poetry is purely emotional, and purely intellectual is prose. In the early life of any nation generally the emotional side predominates. As it gains in experiance, in civilization when science develops, when time for offering criticism arrives, then that is the time for prose, prose comes into existence on its own accord."

ఈపై విషయమును ఆంధ్ర వాఙ్మయముపట్ల సంపూర్ణముగా సమర్థించుటకు వీలు కనఁబడదు గాని యది కొంతవఱకు కన్వయింపకపోదు. ఆంధ్రవాఙ్మయము సంస్కృతవాఙ్మయ సంసర్గము చేఁబుట్టి తద్రసముచే బుష్టిఁజెంది పెంపొంది కొంతకాలమునకు స్వాతంత్ర్యమును స్వాభావిక రామణీయకతను బడసిన కృత్రిమో (artificial) ద్యానమువంటిది. సంస్కృత భాషాసంపర్క ప్రభావముచేతనే యీవాఙ్మయమునందాది కవీంద్రులని ప్రసిద్ధిఁజెందినవారు ఆదికావ్యముగా గ్రహింపఁబడిన యాంధ్రభారతమును చంపూకావ్యముగా రచించుట తటస్థించినది. తిక్కన నిర్వచన గ్రంథము వ్రాసినను తరువాతి యాంధ్ర కవులందఱును భారత ఫక్కిని చంపూమార్గమునే యాదరించి యవలంబించిరిగాని యిటీవలి కాలమువఱకు నిర్వచన కావ్యరచనకుఁగడంగలేదు. నన్నయకుఁ బూర్వమునఁగల దేశీయవాఙ్మయ మింతవఱకు నుద్ధరింపఁబడుటకుఁ దగిన యవకాశములు లేకపోవుటచే దానిస్వరూప మిదమిత్థమని నిర్ణయించుట కంతగా వీలులేక పోయినను, అప్పటినుండి యీకాలమువఱకును ప్రాకృతజనుల వ్యవహారములోనుండి వారియాదరమునకు విశేషముగఁ బాత్రంబగుచున్న పదములు పాటలు మొదలగు ప్రాకృత గేయవాఙ్మయ స్వరూపమును బట్టి నన్నయకుఁ బూర్వమున గలిగినట్టి ప్రప్రథమాంధ్రదేశీయ వాఙ్మయమనునది యొకవిధముగ ఛందోబద్ధంబై, అనుప్రాసోపశోభితంబై యతియుతంబై, తాళలయాన్వితంబైన



గేయ కవిత్వరూపముననుండెడిదని యూహించుట కవకాశము లేకపోలేదు. ఈదృశకవిత్వ విజృంభణము కేవల గీర్వాణ కవితా మర్యాదాభిమానులై తదనుసరణ కుతూహలాయత్తచిత్తులగు నాదికవుల కవితోద్యోగముచే నణఁగిపోయినను స్వాభావికంబైన యీప్రాకృత కవిత్వమఁయొక్క జాడలు మతావేశముచేఁ బైకుబికి పాల్కురికి సోమనాథుని కవితయందును రంగనాథ శ్రీనాథాదుల వీరచరితములందును అప్పుడప్పుడు పొడసూపుచునేయుండి, తుదకు 17-18 శతాబ్దులందు దక్షిణదేశమున గొంచెము తలయెత్తినవి. పరదేశ భాషామధ్యగతులైన యాంధ్రుల కీకాలముననే యాంధ్రగద్యరచనల యావశ్యకతయు గలుగుటచే నాంధ్రగద్య కావ్యములుగూడ నీదేశమున బయలుదేరుట తటస్థించినది.

కాని, ఆంధ్రదేశమునఁ బాశ్చాత్త్య దేశభాషావాఙ్మయములతోడి సంబంధము ప్రబలిన తరువాతఁగాని, అనఁగా 19-వ శతాబ్దము మధ్యభాగమువఱకు నాంధ్రకవులు గద్యకావ్యరచనకుఁ గడంగలేదు. కడచిన శతాబ్దములో మన యాంధ్రదేశమున నాంధ్రగీర్వాణముల నసమాన పాండిత్యముగలిగి యుభయభాషలయందును నిరర్గళముగ కవిత్వముంజెప్పి యనేక గ్రంథములు రచించుటేగాక యాంధ్రమునఁ గ్రొత్తమార్గములఁ ద్రొక్కినవారిలో "పరశురామవిజ"యాది గ్రంథరచయితయగు కోరాడ రామచంద్ర శాస్త్రిగా రగ్రగణ్యులని చెప్పుటకు సంశయములేదు. కాళిదాసుని మేఘసందేశకథను "ఘనవృత్త" మనుపేర పూరించుటేగాక, అతని కుమార సంభవమునకు బదులుగా కుమారోదయమను నుద్గ్రంథమును రచించెను. ఇట్లు సంస్కృతమున నీయన రచించిన యిరువది ముప్పది గ్రంథములేగాక యాంధ్రగ్రంథములు సయితము దేశమున విశేషవ్యాప్తినందకున్నను, వీని యాంధ్రగ్రంథములు ఆంధ్రవాఙ్మయమున నూతన శాఖలకు దారితీసిన యగ్రగణ్యులలో నీయన యొకఁడని చాటుచున్నవి. ఆంధ్రమున సంస్కృతనాటకములను దెనిగించుటకును, కల్పిత కథతో నాటకము వ్రాయుటకును గడంగినవారిలో నీయన ప్రథముఁడు. ఆంధ్రకవులింకను

నాటకాదిరూపకరచనకుందిగని కాలమున నీయన.—

"బహుళగుణంబుల ననేకలేఖనీ విలేఖిత హృద్యపద్యావళి సంతోషిత పరజన స్వాంతుండగు నతండొక్కనాడు, నానావిధ ప్రబంధ ప్రకారంబులు గోష్ఠీవశంబునందలపోయుచు దృశ్యశ్రవ్య కథామయంబులగు కావ్యంబుల శ్రవ్యమాత్రంబుల మహాకవులచేఁ ద్రిలింగభాషయందు గ్రథితంబులుగ, దృశ్యంబులగు నవి తాదృశంబులు గామికింజింతించి తద్గ్రథననిషేధ కారణంబుఁగానక......సంచితోత్సాహుండై సంస్కృతాంధ్రమిశ్రంబుగాఁ బ్రాచీనాను శాసనోక్తలక్షణ లక్షితంబగునటుల సకల సరసపదార్థ వనీవాటి యగుఁ 'మంజరీమధుకరీయంబను నాటిక'ను రచించియుండెను." ఇందలి కథ యపూర్వము, స్వకల్పితము. ఇది ప్రాచీన సాంప్రదాయముల ననుసరించి కవులందఱు స్వీయపాండిత్యప్రకర్షయే ముఖ్యముగాఁ దలంచుచుండెడి కాలమున—అనఁగా మధ్యయుగమున—వ్రాసినగ్రంథమగుటచే నాధునిక నాటకముల కంటె కించిద్భిన్నమై మిగుల పెద్దదిగా గనఁబడినను ఆంధ్ర వాఙ్మయమున కేవలము యక్షగానాది ప్రాకృతనాటక ఫక్కినిగాక, ప్రాచీనసంస్కృత సాంప్రదాయములననుసరించి నాటకమువలె లేనికాలమున బయలుదేరినదగుటచే నాంధ్ర వాఙ్మయమున నాటక శాఖకుమూలము లగు గ్రంధములలో నిది యొక్కటియై యుండెననుటకు సంశయములేదు. ఇంతేగాక శాకుంతలము, వేణీసంహారము, ముద్రారాక్షసము మొదలగు సంస్కృత నాటకముల నింతకుబూర్వమే యాంధ్రీకరించి యీయుద్యమమునకు దారితీసినవారైరి. ఈసందర్భమున నీయన శిష్యులును రాజమహేంద్రవరమునందలి గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీలో ప్రధాన పండితులుగ నుండిన బ్రహ్మశ్రీ వాపివాల వాసుదేవశాస్త్రిగారు తామాంధ్రీకరించిన ఉత్తరరామ చరిత్ర నాటకమున కుపోద్ఘాతముగ రచించిన యీక్రింది వాక్యములు గమనింపఁదగి యున్నవి.

"It is conceded on all hands that Dramas arv atleast as much a source of instruction as any other



department of knowledge. It is however unfortunate that Telugu Language had till very recently laid no pretentions to the possession of Dramatic Literature. Thiswhs way the chapter on Dramaturgy has been left untranslated by Bhattumurty in his popular treatise onRhetoric KavyalankaraSangraha The vedantic ' Morality' Prabodha Chandrodaya of Krishna Misra was afterwards rendered into Telugu, but cnly east in the Epic mould. But after what may be termed the revival of Telugu Literature has set in it has struck my Guru Brahmasri Korada RamaChandra SastryGaru of Masulipatam how sadly defective our native tongue was in Dramatic works—not to speak of the consequent absence of facilities to elevate the moral tone of the masses — that great Pundit translated Veni Samhsra of Bhattanarayana and other Damas' whose Telugu renderings have some how not yet got through the press. Mr. Kokkonda Venkataratnam Pantulu residing in Madras followed in the wak end published his version of the Narakasura. Vijaya Vyayoga of Dharma Bhatta. Then Sreeman Paravastu Venkata Rangachariar Averghal of Vizagapatam commenced translating the Sankuntalam of Kalidasa.

ఇఁక నాంధ్ర సారస్వతమున ప్రథమమున గద్య కావ్యరచనకుం గడంగిన వారిలో నీయనయొకఁడని చెప్పఁదగియున్నది. నయప్రదీపమను విగ్రహము ఈయన రచించిన గద్యకావ్యములలో మొదటిది. విష్ణుశర్మ విర

చితమగు విగ్రహ కథ యిందు విశేషముగా పెంచి వ్రాయఁబడినది. నూతనముగా రాజ్యమునకు వచ్చిన రాజహంసునకు మంత్రి రాజనీతి నుపదేశించె ననుమిషచే ననేక గాథలతోఁ గూడిన సుమారు డెబ్బది పేజీలు పరిమితిగల స్వకల్పిత గ్రంథమందుఁ జేర్పఁబడినది. ఇది యొక్కొకచోఁ దీర్ఘసమాన జటిలంబై, యొక్కొకచో నను ప్రాసోపశోభితంబులగు నచ్చతెలుఁగు పదముల యల్లిక జిగిచే నలరారుచున్నదై, నారికేళపాకముగల దైనను, ఈతనిచే రచింపఁబడిన "రథాంగదూతము" "పరశురామ విజయము" అను గద్యకావ్యములు మిగుల సరళంబగు శైలిని రచింపబడుటఁ జూడ నప్పటికే గద్యశైలియందలి రుచి (TASTE) మాఱుచుండె ననియు నామార్పున కనుగుణ్యముగనే యీయన ప్రయత్నములు సలుపుచుండుటవలన నూతనయుగావిర్భావమీయన కప్పుడే కొంత సోకెననియు నట్టినూతనయుగ చిహ్నములే యీయనరచనలయందుఁ బొడసూపెననియు మనము తలంపఁదగియున్నది.

ఇట్లాంధ్రసారస్వతమున నూతనయుగావిర్భావమును సూచించు కవులలో నొకఁడగు సీరామచంద్రకవి కోరాడాన్వయుఁడు కౌండిన్యసగోత్రుఁడు ఆపస్తంబసూత్రుఁడు. ఈకోరాడాన్వయమునకు మూలపురుషుఁడగు మహాదేవశాస్త్రి యనునాయన శ్రీశైలపర్వతమున నిరువదియేడు దివసంబులు వేపమారేడాకులఁదిని తపస్సుచేయఁగాఁ దనకు సాక్షాత్కరించిన భ్రమరాంబికవలనఁ దనవంశ మేడుపురుషాంతరములవఱకు సర్వశాస్త్ర పారంగతులగు పండితులచే నెగడునట్లు వరముంబడసెను. అప్పటినుండియు నీవంశము పండిత వంశమై యలరారుచుండెను. ఈ వంశమున నల్లాడశాస్త్రి యను నాయన 'శతఘంటిక చూడామణి' యను బిరుదు వడసెను. ఈరామచంద్ర కవి తల్లి సుబ్బమాంబ. తండ్రి లక్ష్మణశాస్త్రి. ఈయన శ్రీరామతారక మంత్రోపాసకుఁడు. వీరి నివాసము గోదావరిజిల్లా అమలాపురం తాలూకా నడవపల్లిగ్రామము. రామచంద్రకవి పిన్ననాటనే తండ్రియొద్ద శ్రీరామమంత్ర ముపదేశముబొంది శాస్త్రాధ్యయనముచేసి గ్రంథరచన ప్రారంభించెను. శృంగార సుధార్ణవమను భాణము నాయన 17-వ యేటనే



రచించెను. మఱియు శ్రీ శిష్టుకృష్ణమూర్తి శాస్త్రిగారి శిష్యుఁడై యనర్గళకవితాధారతో సంస్కృతాంధ్రములఁ ననేక గ్రంథముల రచించెను.

శ్రీశిష్టు వంశాబ్ధి శిశిరకరుఁడు
సకలవిద్యాజన్మసద్మాయమానజి
హ్వాంచలుఁడమిత కావ్యాళికర్త
యయిన శ్రీకృష్ణమూర్తి పదాబ్జసేవ
నాత్తసద్గ్రంథకల్పనా విత్తసుమతి
విరచితశ్రవ్యదృశ్యాత్మ వివిధకావ్యుఁడు

అని తననుగూర్చి మంజరీమధుకరీయమునఁ జెప్పికొనియున్నాఁడు. పిదప నీయన చెన్నపురిలో పండితమునశీయుద్యోగము సంపాదించుటకై యిల్లువెడలి దారిలో బందరుచేరి యచ్చటకొందఱు స్నేహితులప్రోద్బలంబున నిలచిపోయి బందరు నోబిలుమిషన్ పాఠశాలయం దుపాధ్యాయుఁడుగ ప్రవేశించి నలువదిమూఁడు సంవత్సరము లాత్మగౌరవ స్వాతంత్ర్యమునకే మాత్రము భంగమువాటిలకుండఁబనిచేసి పిదప పండ్రెండు సంవత్సరములు గౌరవ వేతనంబును బొంది శార్వరిసంవత్సర శ్రావణ బహుళ పాడ్యమి దినమున (1900) స్వర్గస్థులైరి.

ఆంధ్రదేశమందలి గద్యవాఙ్మయ శాఖకుఁ జెందిన మొదటిగ్రంథములలో నిదియైనను ఇంతకాలము ప్రకటితముకాకయున్న రామవిజయమను గద్యకావ్యములు తజ్ఞుల యాదరమును బడయుఁగాత.

కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ.,

చెన్నపురి.

శ్రీ ర స్తు.

# నయప్రదీపము – విగ్రహము.

## మంగళాచరణము.

క. లలితనిజసంగ మంగళ
నిలయుఁ గమల రిష్టధాము * నేత్రాశయునిఁ
గలితరసభావభంగిఁ
దెలియంపం జేయు శ్రీని * వేఁడుకఁ దలఁతున్.

## సుకవిసంస్తుతి.

తొల్లింటి కైసకులు దా రొనర్పంబూనినకబ్బంబుల మోమున నేమమ్మునం బ్రేమమ్మునం జరిగితఱితొందలి కబ్బంబు సేతరుల నిబ్బరంబగు గబ్బితనంబున మిగుల నగ్గింత్రు వెగ్గలంబు లగు లగ్గులకుం దుం దగ్గులేనిదములు గల తెలవరులకు బాగుల కిక్కులగు నల గొనంబులకు వాకులయేలిక లయి కన్నట్టునట్టి కయిజెట్టులం గట్టిగం గొనియాడుట నప్పసంబుగ నొప్పులకుం దిప్పయగుట నిచ్చట వ్రాయుట చేటతనఁబు నొందింప దని యే నెంచెద. తిన్ననిమన్ననలం జెన్నొందుచదువరులకు గొను బులకొనుట సాజం బగుటచే నట్టి జా నైనమున్నఁటులు గల వారు పెఱవారు దము వేడ కుండినను, వారిఘొయివులం జూ వ

ట్టు చెట్టలం దిమ్మనితనంబులం బరికించునజ్జఁ బగం దిగనాడి నిక్కంబు గాన వక్కాణింత్రు. చవుల తెలవరి దనశోఁటబుట్టిన ముసిణికాయలం గైవారంబుసేసి, లాతివారి నేలలం గల యలతి గాని చవిదావులకు మావు లగు మావులఁ బండ్ల నీసడింపఁడు గదా. వా రట్టివార లై రేని, నొకవెరవరులే మఱిపెక్కు లగు నుక్కివతనంబులకు నిక్కలై సొక్కక చక్కఁదనంబునం బిక్కటిల్లు సర్యైకబ్బంబుల నబ్బురంబుల నుబ్బి గబ్బితనంబున మట్టువడక కన్పట్టునట్టి గొనంబుల గుట్టలం బట్టు లేక కట్టఁసెడి పట్టువట్టి దోసంగులకుం బొసంగుచుండు ముక్కిడికయి వెసంగులం బెడంగునసైన నాఱడి సేయుటకైనం దలంప నోఁపను.

## కుకవినింద.

వెండియుం గొందఱు దమకబ్బంబుల ముందల నంపలి యందంబులుఁ గందువు లగువారలకుఁ బొందుగం దెలుపు చందంబున నగ్గింతురు. పొచ్చెంపు దలంపులవాఁ డొకండు నిచ్చల నల నల్లమందుం దెచ్చి యంగడి నంచి, యిది మెకంపు బొడ్డని బాసచే నానఁ బొసంగించిన, నెట్టివీఱిడి యైన నది యుట్టిదియ యని యెట్టకేనియు నమ్మికకుం బట్టగునే ? మఱియు నెట్టిదిట్ట యైన నగతాళిం జేయందలంచి, యిది యాఁతపంచు దినుము మని యెదుటివానికిం గన్నులుమూసి నోటఁబెట్టిన నా మెక్కుడివాఁడు చవిఁగొనుటం దిట్ట యగు నేని, నెవ్వం డిది గజ్జరం బని నమ్మిక నొందకుండు ? ఇంతియ కాదు. అల కానలనేలల మూలలం దుండిన మ్రానులెల్ల నెల్లరులం బొటసా



రుశేతెంచి తమపుప్పంబులం గుప్పలం గప్పంబులు గాఁ గొనుదు రను నిచ్చచేతనే యవి యయ్యైయజ్జలఁ బూయుచున్నయవియే? ఇంక నే మనిన, వాని కట్లగుట యోజ. ఎత్తరి నైన నెవ్వం డేని దయ్యంపునిచ్చ నచ్చటి కేతెంచి చూచిన, నవ్విదనకుఁ గన్పట్టఁ బట్టఁబట్టి నెట్టనం దిట్టతనంబునం బట్టి పుట్టిన సంతసంబుతో వాని వశత నొందించి, యాహా ! యిట్టివి నేటి కబ్బె ననుచు మాటిమాటికిని సాటిలేనికడు వేడుకం బడు.

మఱియు నిప్పుడు మిమూనసులకు నొక్కటి సాజం బై కానుపించుచున్నయది. అది యెద్ది యనిన, నొండొంటఁ గంటు మీఱిన గొనంబుల కిరవు లగుమనంబులఁ జెలంగు వారొరులు దూరిన వానిం దారు నేకొనుట వెడదయై కానుపించుచున్నది. ఒ డొంట వింగడంపు తనంబునం బే రొంది వాడుకంజెంది చెన్నొందు వాఁడి వేఁడి చలిమిరితనంబుల సాజంబు లగు వారలకు నాలు మీలు మొదలుగల మొయిదారి గుట్టలకుఁ వెండియు నట్టి తొవదమ్ములకుఁ మఱియు నివిలోనగు పెక్కు లగునరతంబు లొండొంటి సైప నోపని గొనంబులు గల యయ్యనంటి గజ్జరంబులు లోనుగాఁగలవియునుం గాన గొలంకులును జేల్ప గట్లును మోముగలవి యొకటికొకటి సుద్దిగాక యుండుటంబట్టి యకాళిఁ జేయుటకుం బ్రోడ లయి యుండును. అట్లుగాన నెక్కతంబుననైనం గుణజ్ఞులిక్కబ్బంబుఁ జేఁబట్ట రేని దోషజ్ఞులు సెకొనుదురు. అట్లయిన వారల విద్వత్తామహిత గుణావాసులని శ్లాఘఁ జేసి వేసరక దలఁచెదను.

## కథావతరణము.

శ్రీదేవీ కరుణాపాత్రుఁ డగు నా సౌదర్శనులకు సౌదర్శన
నందకవిలాసకరుండగుటం జేసి, మహనీయాభిధానుం డగు నా
విష్ణుశర్మ శర్మదంబులు రిపుకర్మ మర్మదంబులు నగు నర్మ వ్యాహా
రంబుల సుహృల్లాభ సుహృద్భేదంబు లను నిరుతంత్రంబు లుపదే
శించి, తదాసన విలసనంబుల వారలకుం గలదదీయార్థ నిర్ధారణా
సమర్థ మేధాసమృద్ధిం బరికించి, యుకించి దుదంచదానంద మంది
రహృదయారవిందుండయి, యోయీ! యాయుష్మంతులారా,
యుష్మన్మనీషావిశేషంబు లశేషపరశేముషీమ త్సరుమవృత్తం
బులఁ బరహీరంబులఁ బరహీరంబులట్ల భేదింప నోపునే కదా!
నయవిజయంబు లైన హృదయంబులు గలవారు తాటస్థ్యంబు
నొందియు సందియంబు దిగనాడి, తత్తత్కాలంబుల కుచితంబు
లగు మెలంగుటల నస్పృశ్యలింగు లై, చికీర్షితార్థ సిద్ధికంబెఁ
దొలుత వెలింగి స్వోచితహిత వ్రాతంబులఁ బ్రోతురు. మా
త్సరంబ బరిమార్తురు. ఈ రింక నెద్దియాలకింపఁ గామింతురు.
వాక్రుచ్చుఁడది ముచ్చటలం జొప్పడ నచ్చువడం దానిచొప్పు
మెప్పుగం జెప్పెద ననిన, నా రాజతనూజాతకుంజరులు సంజాయ
మాన మంజుళ వినయవిస్రంభ శుంభన్ముఖాంభోజు లయి, సం
శ్లిష్ట శయంబు లగుటం జేసి, నిజభుజకాండంబుల కేక కమల
కళికానికేతనంబు లగు నాశంబులఁ గళలసొంపు సంపాదించు
చు, నహ్యబుధోత్తముని గోవిలాసంబుల నామరాల సమున్మా
లిత సంవేశ సత్త్రాకాత్ముల లగుచు, నిజవదనారవిందంబుల మ
రందబిందువులచందంబున నందము లగు నుడితంబుల నిట్లనిరి,



ఆర్య! నిజపాండితీ చాతుర్య తుర్యాంశార్హాయమాణ విజ్ఞానా
చార్య సురాచార్య సదాచార్య! యేము ధరిత్రీ పతిపుత్రుల
మగుటం జేసి తద్విగ్రహాగ్రహం బెట్లు స్వగ్రహంబో యనుచుఁ
దలఁచుచున్నవారము. అది మా కిప్పు ముద్దులుద్దులకు మిగు
ల మిద్దె లగు సన్నంపుసద్దులచేఁ దద్దయు బుద్ధియందు నిద్దంపు
టద్దంబునందువలె నందంబుగఁ బొందుపడ నానతీయుఁడు.
నా ధర్మవర్మ యగు నా విష్ణుశర్మ యిట్లని వచించె. ఓయీ!
మీ కయి యెద్ది ప్రీతిని రీతిగ నుత్పాదించునో, యద్ది వినిపిం
చెద. చుదంబున మీ రందఱు వినుండు

'తొల్లి శతపత్త్ర భూపత్రగోత్ర జాతంబు లగు పత్త్రరథ
వ్రాతంబులతో సేనా[illegible]యాన సంతానంబు లైన నాకయాన
సంతానంబులకు నుద్దియగు బీరంబుచేఁ దోరం బగు కలను
గలుగంగ, నపుడు కపట కుటిలాత్మకంబు లగు కరటంబులచే
విపక్ష పక్షంబులం దక్షయనికృతిపక్షమున నుండి యేమఱుటం
బొందింపఁబడి నమ్మియున్న యమ్మహనీయంబు లగు నచ్ఛచ్ఛ
దంబులు నిజరాజ్యసౌభాగ్యంబు వలన విచ్ఛేదింపం బడియె.'
అనియతండు నుడువ, నా సౌదర్శను లా సుదర్శనమణికి నిట్లనిరి.

## రాజపుత్రులు విష్ణుశర్మను ప్రశ్నించుట.

ఓ[illegible]! యిపుడు నీ నుడివినమినుకులు గడు నిబ్బ
రంబు లగు నబ్బురంబులకుఁ గబ్బితనంబు గరపుచున్నవి. నిక్కం
పు జగం[illegible] వేల్పులదిక్కులరాయునికి రొక్కంబు లగు న
ప్పక్కుల[illegible] గొమ్ములపొంతల నంతంత సంతసిం
చుచు [illegible]ల కెమ్ములు గానీక వీక వె

క్కసంబు లగు కక్కసంబులు గలుగంజేసి, బేసితనమ్మున వాసిహొసంగ నెవ్వండు బెద రెఱుంగక దురంబు గదురంజేసె? అట్టి యవసరంబున నవ్వాయసంబులు, దొలుత సన్మానసలాలసత మంచిగ మించ నెంచందగు నయ్యంచలకు మిక్కుటంబు లగు మక్కువలం బెక్కు విధంబుల నిక్కువంబుగాఁ గానుపించి, నుక్కువంబునఁ బెం పెక్కు తమ తెఱంగు లొరు లెఱుంగకుండ నిక్కి యక్కలహంసవిహంగావతంసంబులకుఁ బిక్కలుసెదర నక్కులు బెదర ముక్కిడితనంబులు సేర వానినెట్లు గ్రుక్కించె? వాటిమనువాటి కెక్కడిది? తద్విభుండు నెట్టి దొరతనంపు వాఁడో? గోరంతైనఁ గొఱంత వడకుండ వక్కాణించుఁ డది యంతయు ననిన నావండితమండనుం డయ్యండజ ప్రకాండ కథ నిట్లని వాక్రువ్వఁ దొడంగె.

## రాజహంసుని కథారంభము.

శ్రీమణీసదాకరం బగు రత్నాకరంబునందు నశేషాంతరీపశ్రేణిమణీహారమహాతరళం బైన కర్పూరద్వీపం బొక్కటి గలదు. పతకంబున మధ్య మణికరణి నద్ద్వీపంబున సకలలోక లోకాలోక సేచనకం బైన పద్మకేళి నామధేయం బగు నొక సరోవరం బుండె. అచ్చట నిశంకటస్వయశః ప్రతాప సమనుగత రాజహంసుం డగు రాజహంస కులావతంసుండు రసాత్మకుఁ డగుటం జేసి, యవ్యభిచరిత స్వార్థాభిధాన గర్భుండగు హిరణ్యగర్భుండు సకలసద్గుణ మణిగణ మహార్ణవుం డై యుండె. అతనికి రాజ్యలాభం బెట్లు గలిగె నంటిరేని, యాలకింపుఁడది సవిస్తరంబుగ నుడివెదను.



## రాజహంసునకు రాజ్యప్రాప్తి గలిగినవిధము.

తొల్లి యుల్లంకయేలిక యగు కల్లోల వల్లభుం డనువాఁడు సకలజలచరశకుంత వ్రాతనేత యై, యెల్లజనులు దాన యయ్య యనియుఁ దాన యవ్వ యనియు నుల్లంబులం దెల్లెడలం దలఁచి సంతసిల్లంగ, బెక్కుదిక్కుల నక్కజం బగు తననిక్కువతనంబు లోనుగానగు గుణగణంబులు ప్రస్ఫుటకనెక్కుడఁ జూచినఁ దామరయై విలసిల్ల సుదిష్టుం డై, నదష్టుం డై, గురూపదిష్టం బైన తెఱవునఁ జిరదిష్టంబుఁ భావించి, యదృష్ట వశంబునఁ ద్రివిష్టపంబున కేఁగె. అంతనతనికి సంతాన ప్రాయంబు లై యుండు శకుంతసంతానంబులు మిగుల వగలం గలంగి తొలంగిన ధైర్యంబులు గలవై కొంతవడికి మునుఁగఱచిన తెలివుల తెరువున నక్కడగండ్లవంతలం బంతంబునం గట్టకడ లంటించి కోక బకమల్లికాఖ్య కాదంబాద్యప్పితృసమవాయంబులు తదీయ మహనీయ రాజకీయభృత్యానుభూతులందు సమవాదంబులు గల వగుటంజేసి, మిథస్సంగతంబు లై సంగతవచనంబుల నిట్లని చింతించె.

## శకుంతముల మంతనము-రాజు నావశ్యకత.

ప్రభు మంత్రోత్సాహశక్తిత్రయ సంపన్నుఁడును, సహాయ సమృద్ధిమంతుండును, సాధనోపాయధనోత్తరుండును, దేశకాలవిభాగజ్ఞానలబ్ధవర్ణుండు నాకస్మికభవిష్ణు విపద్బంధ నికృంతనచణుండును, ఫలానుభవసమర్థుండును సంధివిగ్రహయానాసన ద్వైధీభావ సమాశ్రయ రూపం బైన షాడ్గుణ్యప్రయోగంబునందు నుగణ్యం బైన నైపుణ్యంబుచేఁ బుణ్యంబులం గొల

లోకంబులం బ్రసిద్ధుండును, సామదానభేదదండంబులను నుపాయ చతుష్టయవినియోగార్హ దిష్టవిజ్ఞానపటిష్ఠుండును స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గబలంబు లను నంగసప్తకంబు చేఁ జెన్నొందువాఁడును, సకల సద్గుణ మండితుండును శక్తినృప భూపరాజాద్యర్హాభిధాన విలక్షణ మణినిధానుండును నైన ధరణీనాథుండు రాజాధికారంబునం దప్రమాదుం డై నియామకుండు గాకుండిన, లోకంబులు కల్లోలినీ వల్లభ గర్భమునందుఁ గర్ణధార విరహితం బైన తరణికరణి, మహావాతాదులచే మెండుగఁ గడగండ్లకు గడు నాటపట్టగును. అదియునుం గాక, పుడమిఱేఁ డొకం డేర్పడి, యనాగతనయ నివాసం బైన తనశాసనంబున జనంబులం బాలింప, నవ్వియుఁ దదుపగతసారమందిరంబు లై, తరువులక్రియ లెక్కింప నెక్కసంబు లై యక్కజంబుగఁ బెక్కు లగు ఫల ప్రకరంబుల నిరంతరంబు గరంబు నిజనాథున కభివృద్ధి నొందించు. అట్టి యొకవిభుఁడు వొడమకున్న, నవ్వియున్నను లేని వానివలె నగుటఁ, బెనుచట కంటె మనుసులయ యెన్నెని మడుంగు లెక్కు డనుసుద్ది యుద్దిగా నదియు దాఁట యగు. పంటచెలి మగం డొకండు ఱేఁడు గాఁ డేనిఁ బుడమింగల భూతంబులు భీత్యపేతంబు లై పెచ్చుపెరిగి విచ్చలవిడిఁ [illegible] చ్చపు తనంబులకు హెచ్చునం బాల్పడి త[illegible] నిరర్గళ నిర్గళన్మదకబంధ బంధుర ధారానిర్ధౌత వివేక [illegible] కలితంబు లై, యొడలు మఱచి విశృంఖల సంచారంబు లైన మతంగజంబులు స్వాశ్రయారణ్య భూరుహంబుల భంగిఁ దక్కువ లగు వారిని గడగండ్లను కడలులకుం బాలుసేసి, పిదప నిజ విషయంబులు హతవిషయంబులుగాఁ గవిచ్చాయ లై పిరుందఁ



బందఁబడిన బలుహజ్జ మొకంబుల నెలవునం బలుమార్లు సంతాప సంతాపిత స్వాంతు లై, గండుతనంబు సెడి బెండువడిన డెందముతోఁ గుందుచుందురు. దండిమగం డగుఱేఁడు గలఁడేని, యతండు మార్తాండునిం బోలి యమ్మైత్రులందుఁ గరాకర్షణంబులఁ బ్రజలకు సరసులకుం బోలె వెగ్గలంబగు బెగ్గిలపాటు దగ్గకుండ వారల వైయాత్యంబు మ్రగ్గించుచు, నర్థానేహంబులం గరుణించి బహుళరసాదయంబు లొనరించుచుండు. ఇవ్విధంబున నర్హాసర్వం సహానాథుల సత్తాసత్తలం జేసి యమిత ప్రకృతికము లగు లాభాలాభంబులు గలవు. ఇక్కతంబున మన మండలికుపు డొరులకుం జిక్కక, చక్కని గొనంబుల కిక్కయగు నొక్క నిఁ జక్కలు రిక్కలరేనివలె మక్కువమీఱ నాయమింగావించుట మిక్కిలి యుచితం బని సంతత[illegible] మంతనంబు లొనరించుచు నుండిరి.

## దాయాదులవిజృంభణము - రాజపత్నులువగచుట.

అయ్యనేహంబున సమ్మోహ దురూహా విహ్వలు లగు సమ్మహీభృద్వరారోహాసగర్భజనంబులు దుర్భరం బగు నిర్భరత్వంబు [illegible]రింపుచు, నవివేకత నిర్భర మదప్రముఖ దుర్భర గుణ [illegible]మాణ ధిషణా సుడస్సు లగుచు నేతదధికారంబునకుఁ బాత్రులమేము మేమ యనుచు వివదించుచుండిరి. అయ్యెడ నయ్యండజ మండలాఖండలుని రోమపిత్రికాండంబులు ధవుం డనపత్యుం డై మృతుం డగుటకంటె వారలల్లగుటకు మిగుల వగల మునింగి, నింగిఁ జూచుచుఁ బలుమాఱులు జింతించిరి. ఏమని యనిన, మనకుం దోబుట్టువు లగు

వీరలు తమ యనర్హతం దలంపక మహోన్నతం బైన యిమ్మహీ భర్తృత్వంబునకు నాసించి, యన్యోన్య దుర్ధర్షాదుస్తృష్ణ లగుచు, సంచితపాపప్రపంచంబున విరించనుచే వంచింపఁబడినమనల ననలకీలలకుఁ జెలులైన చెయువులం బలువంతలకు నిశాంతంబుగాఁ జేయుచున్నారు. ఇట్టి బికారులు మము కారంబు సేయుందగినవారే? ఇప్పాలనులకు నేలికతనంబు గలిగినఁ బ్రజాపాలనం బుక్కవం బు దక్కి, చొక్కపురూపునం జక్కంబడునే? కాన మన మిప్పుడు వీరలయం దాత్మీయాభిమానంబు విడిచి, చదురువారి కోరికతనంబున నిక్కర్జంబు నెరవేర్పవలయు. ఇది మొదలుగ జింతించుచు నుమ్మలికల కిమ్మలై యమ్మలు గమ్మిన హృదయమ్ముల వారివిధంబునం బరితపించువారల నభినవరమణ మరణవ్యసన పరవశలఁగా నెఱింగి, తదీయులగు మంత్రిసామంత పురోహితాది హితవ్రాతంబులు శోకోపహత చేతన లగువారలకు ధైర్యంబులు దెలుపుటకుఁ జేరి ఇట్లని వచించిరి.

## సామంతాదులు రాణుల నోదార్చుట.

ఓ తల్లులారా! మీ రిత్తఱిఁ దత్తరపడి యుత్తలపాటు నొందకుఁడు. తొల్లినల్లనయ్యతో నెల్లసుఖంబులు గొల్లలుగాఁ బల్లవింప, నుల్లంబులు బెల్లుగఁ జల్లతనంబునొంద ఘులితలలితవిలసదభంగుర తరంగ భంగ మంగళేతర శృంగార రస సరిత్పతిపరసాంతరంబున నమందంబగు శతానందానందంబున నోలలాడు నా రుక్మిణీ ప్రముఖ రుక్మాంగు లెల్ల నిసువు లెల్ల మడసిన నసువుల దొరబాసి పెక్కు వెక్కసంబు లగు దుక్కం



బులొంది, చెందిన యుక్కటికపాటుల నెట్లు వినము? కాన దృశ్యం బగు విశ్వం బంతయు నీశ్వర వశంబున నశ్వరంబ యనియు విశ్వసింపవలయు నని, హంసాశ్వవిశ్వాసమయ మంత్రపార దృశ్వ లగు సుధీశ్వరులు శశ్వత్పరిశోధితంబు లయిన యర్థంబుల నానతిచ్చెదరు. మఱియు నివి యనుభవ విషయంబులె యై యుండును. అవివేకు లైనవారు సుప్రసిద్ధంబు లైనను నీయర్థంబులఁ దలంకప తమ్ము సనాతనులఁ గా నమ్ముచుఁ గామక్రోధ లోభ మోహ మదమాత్సర్యంబులను నంతశ్శత్రు షట్కంబునకు లోఁబడి, యనర్గళవర్తను లై ధర్మంబుల దిగనాడి, మహాశయాశయ గర్హణీయంబు లగు నంహో వ్యవహారంబులందు బృంహమాణ రంహసాహంకారులై, సౌదామినీ విభ్రమ గృహంబు లైన మహంబులఁ గోరుచుందురు. మఱియుఁ దావిమోతరి మేతరివాఁతంబడిన మొయిలుతఱిపుట్టువు దంశంబుల మొసంగుటకు మెలంగునట్లు, మిత్తిమోరఁ జొఱఁబడియు మేనగులు బద్ధరితనంబులకుఁ దద్దయుం గద్దియ లై, చెలువొందు సాంసారిక శాత సంతానంబులఁ గామించుచు, వెంటన తాపత్రయదుఃఖంబునఁ బొలియుదురు. నిక్కంపుఁ జూపరులు రొక్కంబు లాదిగల యరతంబులందు నక్కజంబగు మక్కువచేఁ ద్రొక్కిస లాడెడి ముక్కడుల నెక్కడం జిక్కఁగ లెక్కింపరు. విందులపొందులు, దలంప వేల్పురాయని మోవులు తమతఱులం గడల నెలైడల గ్రిక్కిరిసి సుక్కత మిక్కుటంబుగ నలజండ్ల కిక్క లగు కడుజండ్ల వెడలింగ, నక్కండంబులు నిబిడంబు లై కలసి మెలసి ప్రవహింపం బరఁగిన, వాఁకలు వీక లయి బడుపోకలఁ బోవంగఁ దత్తద్విషయ నిపతితంబు

లైన కాండప్రకాండంబు లొం డొంటితో నొకటి పెంత సేరి, హత్తి, కొంత దడవు కూడ నడిచి పదంపడి యొడఁబాయు కరణి, నొక దిష్టంబున నదృష్ట విశేషంబున నిష్టతం జెంది మెలసి వర్తించు. పిదపఁ దొల్లి చేరిన వెరవున విడిపోవును. నురిగిన కర్జంబునకుం బొగిలిన నొకింతయైన ఫలంబు గానంబడదు; కాన విదితనకల వేదనీయ లైనమీరలు శోకించుట కర్హులు గారు. ఇక్కతంబున నగల నుడుగుం డనిన, నయ్యెడ నప్పుడమితేని యిగురుబోఁడు లఖండపాండితీ మండన లగుటం జేసి, యమ్మున్యవులబరువులఁ దత్త్వజ్ఞానంబునఁ బ్రదీపంబున నిఱులనువలె సుదూరంబుగఁ బారఁద్రోలి, యరాజకం బగు తమ రాజ్యంబునకుఁ బ్రాజ్యం బైనపూజ్యత లేకునికి నుల్లంబునం బరికించి, వారల నాలోకించి యిట్లని యానతిచ్చిరి.

## రాణుల ప్రతివచనము.

"ఓ సాధువులారా! మీనుడువుల మాడెందంబులఁ జేరినవంతలు సంతతంబు లయ్యు నయ్యనంతరత్న ప్రభలఁ దమంబులం బో... యంతంత నంతియ లై పోయె. అక్కతంబున మనంబు లుజ్జిదితనంబుఁ జెందె. అయినను మనరాజ్యం బిపు డరాజకం బగుటచే, ననర్హు లయిన బహుబంధువు లాక్రమింపఁ గోరుచున్నారలు; కాన మీర లిప్పుడీరాజ్యంబు భోజ్యంబుగ జేసికొనం దగినట్టు సద్గుణంబుల కిక్క యగు నొక్కపక్కితేని నిక్కం బగు మక్కువతో నిరూపించి, యసత్తుల శ్లోకరాశితోడ మీ రందఱుం బురుశర్మంబులతో నుండ నతనికిఁ బట్టంబుఁ గట్టుఁడు. లోకోత్తర శౌర్యౌదార్య గాంభీర్యోజ్జ్వల్య



వైదగ్ధ్య మహాభాగ్య తేజస్విత్వ ధార్మికత్వ మహాకులీనత్వంబు లనియెడి సత్తమ గుణంబులకు శరణం బై, మఱియు వర్ణానుకంపా ప్రముఖనిఖిలసద్గుణ మణిగణంబులకు నాకరం బైన నయనిలయున కర్హం బైన రాజ్యాధికారం, బనర్హునకు నాత్మీయాభిమానిత నొసంగె నేని, నద్ది విధివిహిత సంస్కారభరసమింధమానంబు నుదగ్ర జాగ్రజ్జ్వాలావళీ కబళిత కళేబరంబు నైన యసితాయనంబునం దుపక్షిప్తవ్యం బైన హవ్యంబు కౌలేయకాధిష్ఠిత భూతి గర్తంబునం దుపక్షిప్తం బైనభంగి నభవ్యం బగు. మఱియు నిజభాగ్య విశేషంబున నుపవనాంతర తరువ్రాతంబువలన సరసశీతలరసధురంధరంబు లగు ఫలభరంబులు గలుగఁగాఁ దా నవి యాస్వాదింపఁజాలకయును, బెఱవానికిఁ బెట్టుటకుఁ గార్పణ్యంబుచే నొల్లకయు, నపత్యప్రీతిచే నామయమయకాయు లయినకాయజులకుం బెట్టనెట్టి ఫలంబు వాటించునో, యట్ల యశక్తుం డైనవానికిఁ దదధికారం బిచ్చిన నశక్తతచే నది నిర్వహింపఁబడఁ జాలక పరులచే దోసంగుపాటు ననుభవించును. అదియునుంగాక, నస్థానే పదశక్య స్థానేరితం బైన బీజంబువిధంబున స్మర్తవ్యైకనికాంతం బ... అంతియ కాక, నిజక్షుధాపనోదనైకతాన మానసం బగు ద్వీపికయిన కండూత్యపనోదనదానంబు పగిది, యాత్మానర్థ ఫలసంపాదకం బగు" ననిన నాసభ్యులు సకల సదంతరంగ హృదయంగమ వాణు లగు నారాణుల వాణుల నాకర్ణించి, తదీయ సాధుత్వంబునకు నితాంతంబు సంతసించి, యట్లు సేయ నొప్పువాఁ డెవ్వండొకో యనుచు సంవిదయంబులచే మందంబు లగు డెం

దంబులఁ జింతల నొందుచుండఁ, దత్రత్యామాత్యశేఖరుం డైన త్రికాల వేది యను వాఁ డా యనంతాకాంతకాంతామతల్లుల కిట్లని విన్నవించెను

త్రికాలవేదియనుమంత్రి యుపన్యసించుట.

ఓయమ్మలారా! భావుక నిశాంతం బగు భావత్కాకూతంబు నాకు విదితం బయ్యె. మీరలీయెడ జీవితేశ వ్యసన సంజనిత నిర్విషయాభిలాషత నిజరాజ్యంబు సముచితపాత్రాయత్తంబ్బొనరించి, మహనీయమునిజన సమ్మాన్యాచారంబులఁ జెలంగ నాత్మయం దతినిబిడసముద్యమంబులు గలిగియున్నారలు. తత్త్వవేత్త లగు సత్తములచిత్తమ్ములు కడగండ్లతఱిం దత్తఱపాటు వాటింపక, వాటంబునఁ గూటంబుల సూటిం దాటించుచుఁ దాటించుచు, నిజవృత్తుల నుత్తలంపు తలంపులఁ గలిగించుచు, నలలం గడు బెట్టిదం బగు నంగదకడలిఁ గడముట్ట నఖిలశస్త్ర ధీస్త్వవ్యంబు లగు. మీరు రాజర్షి కాంతలు గాన నిట్టి ధర్మంబుఁ దలంచితిరిగాక, పెఱవారి కెవ్వరికైన నిద్ది దుశ్శకంబ. 'ధర్మస్య త్వరితా గతిః' 'శ్రేయాంసి బహువిఘ్నాని' యను నార్ష వచనంబుల సపర్యాపదంబు నొందించి, వైశంబుగ నిర్వేళ హాళిగ నొకతీర్పరి నేర్పఱచి, పబువుతనం బతని పనుపున నుంచుట నిజంబుగ మనజగంబు మెచ్చుటగదా! అనుచున్న యాప్రెగ్గడవలంతికి నయ్యిల్లాండ్రిట్లని నాకుప్రచ్చిరి.

రాణులు రాజు నేర్పరవు మని త్రికాలవేది కాజ్ఞ యిచ్చుట.

ఓయీ! భవదీయం బగు నాహ్వయంబు సరోజరాజాదిపదంబుల పదంబున యోగరూఢత్వంబుచే నిరూఢం బగు. అట్లగుటం గదా మనయేలిక మును సంశ్రితజనసంతాపకతీరం బగుతనయశోవిశద పటకుటీరంబునకుఁ గంబంబుగ నిన్ను నునిచె! ఇప్పు డిట్టివార లైన యేము, కృతజ్ఞతారసజ్ఞండ వైన నీకుఁ గర్జంబులు గలుప నెయ్యది నూపట్టెడు? కాన, ధరణీభరణదక్షిణగుణగరిష్ఠుండును, నిజప్రజాప్రాణ మానసోల్లాససంధానపటిష్ఠుండును నగు నొకయువిష్ఠుని నీతిసామ్రాజ్య పూజ్యుం డగువాని నిర్ధారితుం జేసి యర్థానుకూల్యంబున మనవైభవంబు లొప్పు, భద్రాసనాసీనుఁ జేయు మనిన, నన్నియోగివరుండు మఱల వారికి నిట్లని వినిచె.

త్రికాలవేది రాజనీతితెఱంగు వివరించి, రాజుగా హిరణ్యగర్భు నొనర్పు మనుట.

ఇమ్మహాలు నున్నయమ్మహాసుహాలు లెల్ల దెల్లంబుగ నల్లంబులఁ బరికింపరాని యర్థం బుద్ధరించుటకై పరికించుటకు సర్థించుట యనుచితంబు. అయినను మీరలు నామీఁద నిర్భరం బగు నబ్బరంబు నిలిపి యడిగిన, నూరకుంట దంటతనంబు గాదు. నయం బాఖండనంబు రాద్ధాంతత కర్హంబు. ప్రతియుక్తి కలిగి నయపుడ బాధితం బగు. అది లేకున్న సిద్ధాంతంబ. కాన మామకీనం బగు నిష్టంబు గష్టంబులేకుండఁ దేటపరచెద. సావధానులరై మీరు చాలింపుఁడు. పొచ్చంబు లగుటచేఁ దొచ్చంబు లగు గ్రచ్చులతో మ్రుచ్చులవలెఁ దమయిచ్చల

మచ్చుల నెచ్చుగ మాటువరచి, మెచ్చైన వేషంబులతోఁ
జూపులకు రూపరులై మంచికాఁపరులఁబోలి యిరువొందువారు
పెక్కురు గలరు. వారల సందఱ నేను పేర్చి చెప్ప నేల?
నా తెలిసినవారలలో నొకండు గలఁ డతండు సకలభంగుల నా
కభిమతుండు. ఇచ్చటివలంతు లెవ్వ రేని నతనియందు లోకంబు
లుండె నేని నారసి యాడందగుదురు. ఇతనికంటె నెవ్వం డేని
గుణధారల ఘనుం డేని, నతండును నుపుసందగినవాఁడే యగు.
వినుండు. అస్మాకీనం బగు విషయంబున నుండు వారలలో సర్వజ్ఞుఁ
డను వాఁడు గరంబు నార్యవర్యుండు. సూర్యమమత మర్యాదుండు
నై యొప్పు. మఱియు నాతండు గడు శుచిదృష్టి యగుటం
జేసి విమత సంఘాత కృతాంతుండు సంతానీకృతసంశ్రితజన
సంతానుండు నగుటంబట్టి, జెట్టిదంపు దండిమగం డగుచు, నిజ
నామధేయంబున కెల్లయెడల సన్వర్థతా భాగధేయంబుఁ బొలిం
చువాఁడు; గావున నతండు సర్వజ్ఞుండ. మును నలినాసనుం డళిక
దృక్కును దన నెన్నుదుటఁ బుట్టించినవాఁడుగాన రుద్రునికంటెఁ
దాన ఘనుండని తోడెంపు తెలవులవారు నీరసింప, నది దన కవ
ఓమతంబగుట మా యిరువురకుం దారతమ్య విచారంబు సేయం
దగ దని నిరూపించుటకుం బోలె నాసర్వజ్ఞున కిరువ్యేడల నా
హిరణ్యగర్భుండ యీ హిరణ్యగర్భుండై యిట్టులు జనియించె.
మఱియు నితండు, సుమనస్సేవ్యత నింద్రాంశత్వంబును, శుచి
త్వంబున శోచిష్కేశతను, సమవర్తిత్వంబున దండధరతఁ
బుణ్యజనత్వంబున నైరృతత్వంబును, ప్రచేతస్కతం బాశితను,
సదాగతియగుటఁ జగత్ప్రాణభావంబును, సర్వజ్ఞపేమ
పాత్రుం డగుట రాజరాజధర్మంబును, సర్వమంగళాశ్లిష్ట



ధాముండగుట మహేశ్వరాత్మతను, సుదర్శనపదుండగుట లక్ష్మీ
నాయకత్వంబునను, వేది యగుట వాగీశతను తేజరిల్లుచుండు
వాఁడు. కాన 'సప్తాభిశ్చ దిగీశానాం మాత్రాభిర్నిర్మితో
నృప' యనియును, 'నా౽విష్ణుః పృథివీపతి' యనియును ప్రసిద్ధం
బులైన యుభయుక్తరాద్ధాంతంబులఁ దల్లక్షణంబుల కతఁ
యం బగు రక్షాకరణం బగుటంజేసి, యీతండ యుద్ధరణీ మం
డల భరనిర్వహణంబున కర్హుండు. మఱియుఁ బెక్కులు నిక్కం
బుగ నిక్కవిరా జిక్కగల గొనంబులు జనంబుల మనంబుల
నుల్లసింపం జేయంజాలి మన్ననలకుం దిన్నలై యున్నయవి. అవి
యన్నియు నివు డెన్న నేల? మునుమున్న గార్యంబుల వలన
నార్యులచే సపర్యాపథంబు నొందింపఁబడఁగలవు. నా కితండు
కడమవారలకంటె నెక్కుడు చుట్ట మని, పట్టువట్టి యాడను. మ
ఱియుఁ గైసరునికైవడి నాతనివలనఁ జొక్కాటంబు లగు తోడ
వులఁ జొక్కంబు లగు రొక్కంబులఁ జొక్కాటంబు లగు
నలువుల గన్నాకులఁ గరువలగేలిం గొట్టఁ జాలినట్టి దిట్టతనం
బులకు మనికిపట్టులైన బాబాతలకట్టులనైన నసదగుతలంపు
ననైనఁ దలంపను. కఱియగుటంజేసి యింతపట్టు వలికితిని.
ఇదియె నా నుక్కుతనంబునఁ గల నిక్కువంబు. పెక్కు లేల?
మహారాజరాజవదన లగు మీర పాఱఁజూచి బాగుగఁ బరికిం
పుఁడు. ఇంకను బొంకంబుగ సాప్తు లగు వారితోడఁ బలు
మాఱు లాలోచింపుఁడు" ఇ ట్లని యప్పు డతఁడు మిన్న
కుండె.

## తక్కినవారు సమ్మంత్రిమాటల బలపఱచుట.

అంతట నచ్చటి మేటి దొరలు మొదలగుగలవార లమ్మంత్రిప్రకాండముండనుని నుడువులను జెందంబుల మివుల నానందంబు నొంది తరుణ తరతరణి కిరణప్రభాపటల సంపలనంబున వికాసకళలఁ జెన్నొందు నరవింద సౌందర్యసంపదల నందంబుగ ననుసరించువదనంబులు గలవార లగుచుఁ బొందుగ సత్ప్రశ్రయమిశ్రమంబు లగుట నజస్రంబు,నశ్రాప్తతఁ దేటఁబరుపఁదగు నుదితంబుల సమ్మానవతుల కిట్లని సమ్మదంబుననుడివిరి. "మీరు సర్వజ్ఞదేశ్యం డైన యొడయనికిఁ గడు కౌశలంబునఁ ననతు లగు నతులగుట మీకుఁ దెలియంబడనికర్జంబుల తెరవొకండేనిఁ గానంబడదు. అయినను మీరలు మాబోఁటరులందుఁ డంటతనం బారోపించి మన్నించుట కై, నిజస్వాతంత్ర్యంబులఁ గానుపింపక, యాత్మీయప్రకృతిజనంబులమనంబుల నుల్లసిల్లెడినిచ్చల మెచ్చుగ సేకరంప వక్కాణించితిరి. మేమందఱము సైకంపుఁ దెలివిచేఁ బరికింపనొప్పు నిట్టి పురుషవిశేష నిరూపణంబు దత్తరపాటుచే సుకరంబు గానిదగుట, మీమీ వారలుఁ జెక్కం ద్రిద్దొరతనంబు సేకరింపఁ గోరియుండుట, నొక్కని నిక్కంబుగఁ జెప్పినం దక్కినవారు మిక్కిలియు నలుకం బొక్కుదు రని సందియంబు నొంది, మందమతుల మైనుడువనేరకయుంటిమి. ఇప్పుడు కడుదిట్ట యగు నిగ్రహకన్నాకు నుడివిన నుడువులు గడు వేడుకఁ జేయుచు నొప్పులకుఁగుప్పలై యొప్పుచున్నవి. ఇజ్జగంబున విధివశంబున మాతా పితృకల్పితంబు లైన పౌరుషేయ నామంబులు తదీయేచ్ఛాకర



ణంబు లగుటఁ జేసి రూఢిమాత్రంబునన సంకేతంబు లై లోకవ్యవహారంబున కుపయోగించుచున్నవి. ఇచ్చదువరి జేజేల బువ్వజోతి యొక్కండ తనపేరునకు నరతం బవిరతం బొప్ప సాభిధేయుం డయ్యె. కాన నీతండు పలికినమినుకులు మిగుల మాయుల్లంబుల కుల్లాసకరంబు లై యుండె. ఏలిక రాణులయిచ్చయును నిచ్చలుగా నిచ్చెలువునఁ బొచ్చెంపుదనంబు లేకయుండవచ్చు నని తలంచెదము. శక్తసంజ్ఞుం డైన యిత్తిరిశాలవేదివరనంబున నేయగి నిర్గమించి శ్రుతిసంగతం బయ్యె నన్నుడువు శ్రుతిసంగతంబ యని వ్రాక్కుచ్చుటకు నించుకయేనిఁ గొంచెపుఁ దనంబు గానంబడదు, కాని జేనిసానుల నమ్మికలకు నమ్మనుకులు మనుకులుగా పుత మని, యనిమిషవదనావలోకనంబొనరించి వచించెదము. ఎం దెందులకును దేవుల తములసొప్పునఁ గర్జంబులు జరుపం గలవార మని వ్రక్కచ్చి యూరకుండిరి.

## రాణులు సర్వజ్ఞునిఁ బిల్వనంపుట.

అంతట నవ్వింటల యొలనాగ యేలిక వెలందులు మనంబుల నమ్మలిక లుడిగి, పొడుగైన యుత్సాహంబులతో వారల కిట్లనిరి. "ఓ యయ్యలారా! మనయొడయని రాజ్యభరణపరిపాటి సుజనరంజనదుర్జనమదభంజనంబులచే ననూనరాజన్య రాజసమ్మాన్యం బై యున్నవిధంబును, అకళంకితంబునఁ బొడమి విమలం బై కడునొప్పియున్నయశంబును, మీకుఁ దెలియ విశదంబ గదా! తొలుతఁ గన్న సత్ఖ్యాతికి విహతి లే కుండఁడి చొప్పున మెండుగ నొప్పియుండ నేని నతనికిఁ బట్టంబుఁ గట్టింపుఁడు. మఱియు నాతం డెక్కడ నుండును? ఆతండు స్వతం

త్రుండో, లేక యిప్పని కప్పరొప్పిక యొప్పముల కేప్వాలా వాఁ డై యుండునో? అద్ది యట్లో నేని వానియయ్యను రావింపుఁడన, వారల యనుమతంబున నప్రగ్గడ అప్పుడ తనకడనున్న యొక్క ఫణిహారునిఁ జూచి, యేలికసానుల శాసనంబున నా సర్వజ్ఞునిఁ దోడ్కొని రమ్మని నియమించిన, వాఁడును నా సర్వజ్ఞుని మనికిపట్టున కరిగి యయ్యుదంతం బతనికి శ్రుతిసంగతం బొనరింప, నాతండును గడు నంతరంగంబునఁ బొంగి యు, ధీరోదాత్తులగు మహాత్ములకుఁ దమ మనస్కారంబులు తిరస్కారవిషయం బులగుటఁ దానును దాద్మశ్లాఘయవశుండగుటం జేసి, దనమనంబునఁ బొడమిన గడుమదంబు పురస్కార సంశ్రయంబు గానీక, దనయిలుఁ జేజేలనమస్కార కర్మత నొందించి, నిగూఢనిజేంగితాకారుం డై యుద్ధూతతోడ నప్పుడ యప్పుడమిఱేని దేవులయొండ కరిగి నిలిచిన, నారాజదారలును నాచదురువారును, యథోచిత సన్మానంబు లొనరించి, తన కుచితం బైన గద్దియఁ గానుపింప, నచ్చటఁ గూర్చుండి, కొంతతడవు తత్కాలోచితవివిధ సంభాషణంబుల వారితోఁ బ్రొద్దుపుచ్చుచుండెను. అత్తరి నద్ధారమఃద్దియలు, పెద్దయు నెద్దులకైన మొద్దులకైనను ముద్దులకు మిగుల మిద్దె లగు తనసుద్దులఁ గలపి పెద్దలకు పద్దియొనరింపఁ జాలినయతని సల్లాపంబుల కుల్లంబులనల్లానంబునొంది, పల్లవించి, మించిన యుత్సాహ ప్రపంచంబు డెందంబునంద పొందుపఱచి, యందంబుగా నమంద మధురంబు లగు నుడితంబుల నతని కిట్లని యానతిచ్చిరి.

## సర్వజ్ఞునితో రాణులు సంభాషించి తమమనోరథంబులఁ దెల్పుట.

“ఓ యయ్యా! ఇయ్యవసరంబున మనదేశంబున కరాజకతా దూషణం బొకటి విధివశంబునఁ బొడమెను. అది యందఱకు నసహ్యంబుగావునఁ దగిన యొకని కియ్యధికారంబునకుఁ బట్టంబుగట్టఁ దలంచి, యిట్టి ప్రభుత్వంబునకు నర్హుం డెవ్వం డని యధ్యాహరించి, యిక్కడ నేఁడుగడవారి నే మడుగఁగా, వారు నాస్మాకీన సదర్థ నిర్ధారణం బుద్ధరింపనద్ధాదరు లై యుండ, నిన్ని యోగిప్రవరుం డెందుఁగ నాలోచనంబు చేసి యిక్కడ నుండువారలలో నిప్పుడమిచెలి నేలనీకొమరుండు దండిమగం డనియును, పరవీరులఁ బరిభవించుటకు నతినిపుణుం డనియును, సకలసకలజనమహనీయగుణరాజిమణిభూషి విరాజమానుం డనియును నుడివె నింతియకాక, ఇచ్చటనున్న చదువరులగు దగవరు లందఱు దత్తగని వేడుకతో వేమరు నుడివి యప్పలుకులఁ గలకండపలుకులవలె మిగుల నగ్గించిరి. కాఁబట్టి దిట్టతనంబున కాటపట్టయిన నీపట్టి కిప్పట్టునఁ బట్టంబు గట్టగట్టితనంబున నట్టులేక నమకట్టి యున్నారము. కాన నీకొమరునిఁ గొమరుమిగులంగల యగ్గలిక వెగ్గలంబుగ నగ్గడింపక, మాకుం బుఁ గావింపు” మనిరి.

## తనకొమరుఁడు రాజ్యానర్హుఁడని సర్వజ్ఞుఁ డనుట.

అప్పిమ్మట నక్కొలవానిఁ జూచిననిప్పచ్చరిచొప్పున విప్పుగ నొప్పరితనం బుప్పతిల్ల నొప్పమి నభినయించుచు నతం

డు నయ్యమాత్యవర్యుదెసఁ జూడ్కి సారించి మించిన వినయంబున ననయంబు దనగానంబులు మెలంగఁ జేయుచు నతని కిట్లని వాక్రుచ్చె:—

"ఓయీ త్రికాలవేదీ! నీయభిధానంబు సరోజాదిపదంబులబోలె ననుగతస్వాభిధేయం బై యోగరూఢం బైనదిగాన నీవు నిచ్చలు......సకల భావుకంబులగుఁ గులభవనంబు లై యొక్కగుణజ్ఞ లైన యేలికసానుల సన్నంబులు గానిమన్ననలకుఁ బన్నువడి జెన్నుమీఱు తిన్ననితెనంబుల నున్న వారల కందఱకుఁ గన్నాకవయి యున్నాఁడవు. నీవిన్నాణపు నుడువుల కెన్నంగను దారుమారు కానేరదు. అయిన నొక్కం డిప్పుడు నీకు మార్గాని వాక్రువ్వవలసె. అద్ది యెద్ది యం టేని, చిరంజీవి యగు మన హిరణ్యగర్భుండు పుడమి మెండుగఁ బూనుటకు సమర్థుం డని మీబోఁటిమేఁటులు గానంబులఁ గానఁదలంపుగలవారు గాన, వానియందలి కరుణచే ని ట్లానతిచ్చితిరి చిన్నరికంబున నతిస్పృదుల ప్రకృతి యగువానియందు నింతటి రాజ్యభరంబుఁ బూన్చుట యసంబ్రమాను లోని సూత్రనాళంబున మెం డగు కొండను బంధించుట గాదే? అదియునుంగాక, వీనిపుట్టువు తఱిగాములగతిఁ బరికింప, బల్లిదు రగు పగతుఱవలనఁ బరాభవంబు సంభవించు నని యంభోజసంభవసిద్ధాంతంబున సుప్రసిద్ధం బై గానంబడుచున్నది. ఇక్కతంబుననిట్టి పబువుతనంబునకు వీఁడు దగినవాఁడు గాఁ డని నిండుగఁ దర్కింపవలయు." అనిన నత్త్రికాలవేది యతని కిట్లను నోయీసర్వజ్ఞా! సీకొమరుని జన్మపత్రిక మాకుఁజూపుము. దానివలననేమును గర్తవ్యం



బుఁ బరికించెదము. అనినం బదంపడి యాసర్వజ్ఞుఁడు నోలుతెఁడాఁ దెలిసినభంగి నద్దానిని లిఖించియిచ్చెను. పిమ్మట నప్రగ్గడదండిమగండు సకలశాస్త్రవిదుండగుటఁ దానిని బాగుగఁ బరికించి సంతసించి యతని కిట్లని వచించె.

## మంత్రి సర్వజ్ఞునిసందియముల వారించుట.

ఓయీ! నీనుడివిన నుడువు నిక్కంబే. అయిన, నెవ్వండు వీనికిఁ దొలుతఁ బరాభవంబు సేయువాఁడవ్వాఁడు వైళంబ యితనివలనఁ బ్రతిపరిభావంబు నొంది వీనితో సఖ్యం బపేక్షించి, మనఁగలండు. కాదా చిక్కపరిభావం బెట్టిదిట్టరులకుఁ గట్టాయితంబుగఁ గొట్టువడక యుండు. తొల్లి నవద్వయసంఖ్యాకశేయుంబు లయినదీవులఁ దనమావులవలనఁ ద్రొక్కించి క్రిక్కిఱిసిన తన తేజంబున సకలసపత్నసమాజంబుల నవ్యాజంబుగ నోడించి, వారివలనఁ గప్పంబులఁ గుప్పలు కుప్పలుగా నప్పనంబున గొని,యాతఱి జోతరులఁ గాతరులం గానీక, పోతరులం బూతరుల నత్తికిబగిది మిత్తికి గుత్తుక బంటి మెకంబుల కై వడి గొఱంతవడని దురంతంబు లైన వంతలకుం బాలింబుగఁ జాలుసేసి, తనయానంబున మొల్లలజాబిల్లిబాల వెల్లులమల్లెం గల్ల గాకుండఁ బ్రల్లదంబునకు నిల్లుంగావించినజాలిన యాదవ యంతీకాంతుం డొకతఱిఁ బగతురచేఁ బరిభవింపంబడి, యిడుమలపా లయి, కడువేదన నొందియుఁ బదంపడి తొల్లిటికంటెఁ బంటలమిటారికి నిమ్మంటకంబుగ దంటతనంబు నెఱపి, నీటుగాఁ దగుచు, సుచిరంబు తఱిజెక్కుమక్కువల కిక్కయై,

సుఖంబుల మెక్కు ననియెడు వాక్కులు మన జానుగులకు వాకులవలెఁ దగిలియున్నవి గదా!

మఱియును నొల్లింటివేళ మొండికట్టెలు మెండుగ గండుమీఱి, తండోపతండంబులుగ సత్వకాండంబులమీఁద దండువెడలి, పండువులకుఁ జాపి యప్పుడమిపూఁబోఁడికి నిండుగ గండంబులుగాఁ జండవృత్తులై యుండఁ జావండఖండనపండితుం డగు నయ్యండజకులమండనధ్వజుం డగ్గరానుల వాగరలాడఁబరికించి యవతరించి, యదువంశంబున నుదారాత్మకుండైననందుని మందిరంబునఁ బెరుగుచుఁ జిఱుతతనంబున ననన్యసామాన్యంబులై జగన్మాన్యంబులైన కర్జంబులచే సర్వతోముఖప్రతిముఖ లేఖర్షభులవలనఁ దోష్టూయమానుం డగుచు నయ్యైయార్యులకు నయ్యై యవసరంబులఁ దాన దానవాంతకుండవ తెలుపుచుఁ, బిదప దంటతనంబునకుఁ బట్టయియుఁ బలుమాఱుల బార్హద్రథుం డను నొక్కటక్కరిదొరచే నిక్కంబుగ నెక్కువచేవగలవాఁ డయ్యును గ్రుక్కింపంబడి, పెక్కుతెఱఁగులఁ బలాయితుం డయ్యె నని పురాణంబుల నెవ్వ రెఱుంగరు? అద్ది యట్లుండనిమ్ము. సంసారపంజరంబున మాయామయంబు లగు దుఃఖాభాసప్రకృతిక సుఖదుఃఖశోకాదినిధనంబు లగు కామప్రముఖపాశంబులచే నియతంబుగ నియతిచేత నియమింపఁబడి యాత్యంతిక దుఃఖాభావసంభిన్నం బగు స్వఃపదార్థంబుఁ దలంపఁగనైనఁ జాలని యస్మాదృశులకుఁ దత్తవస్థాప్రాప్తివలన నెద్ది చింతనీయంబు? నిజసేవకసత్తములకుఁ దత్తాదృశతత్త్వాన్వప్రాణదక్షిణు లగు విధివిధువిధుశీర



భూషణులును దత్తదవసరంబుల నిజశక్తుల కుపచయాపచయంబులఁగనిరి. కాన, నెట్టిదిట్టలైనఁ దఱిఁబట్టి యిమజెట్టితనంబు గట్టిదయ్యును, మట్టుఁదప్పి గుట్టువీఁడి యేతిట్టునను వట్టు లేక, బెట్టిదంపుఁబాటులకుఁ బట్టునట్టు లగుచు, కొంతవట్టు నట్టట్టుగఁ బట్టపగటిదివ్వెలఁ బోలి చూపట్టి, తుట్టతుదకు నెట్టకేని నెట్టట్టుల దిట్టతనంబున మట్టుపడక యట్టిగంటున నట్టుపడని పట్టువట్టి వెండియు మెండుగఁ బోరి మాఱుత నెట్టకేలకు సొట్టుపడక మట్టగించిన మగటిమికాండ్రు గడుదిట్ట లగు పట్టంపుదొరల మన్ననలకుఁ జెన్నుగ మిన్నతనంబు గలిగి తిన్నగ నున్నవారే గదా! అక్కతంబున నీతం డొకతూరి పగఱకుఁ బట్టుపడువాఁ డయ్యును, నప్పుడ జయశీలుఁడు కాఁగలవాఁ డగుట, దొరతనంబున కనర్హుండు గాఁడు.

మఱియుఁ దత్తద్గ్రహస్థితి విశేషంబుఁ బరికింప, నీతండు గడింది మగం డై, యర్థాంతరన్యాసాలంకారంబుదరంబుగఁ బ్రకృతార్థ నిర్వాహణోపపత్తి ప్రవాక్యాంతరుం డై, యుపమాలంకారం బీడుగ సహృదయహృదయాహ్లాదిధర్మభాస్వరుం డై, యనన్వయాలంకారంబుసాటిగ ననన్యోపమానరహితుం డై, యుత్ప్రేక్షాలంకారంబు దీటుగఁ బ్రాకృతాప్రాకృతతాదాత్మ్యకల్పనానిపుణసూహాశ్రయుం డై, శ్లేషాలంకారంబు భంగి నానార్థసంశ్రయ పదసంఘటనాశ్రయుం డై, వికస్వరాలంకారంబు జోష్షుగ విశేష సామాన్య విశేషవిజ్ఞాన మూలక ప్రవర్తనుం డై, సత్కవిగ్రథిత ప్రబంధంబు పురుడుగ నోజఃప్రసాద సమతాది గుణగణ మండితుం డై, యదోషాకరుం డయ్యును

జైవాతృకుం డై, లోకబాంధవుం డయ్యును పంకజాతపరాఙ్ముఖుం డయి, మానసోల్లాసనర్యుం డయ్యు నమానసోల్లాసవర్యుం డై, సుపర్వనాయకుం డయ్యును 'గోత్రానాదకరుం డై, సర్వమంగళాలంకృతధాముం డయ్యు ననుగ్రాభిఖ్యుం డై, సరస్వతీకాంతుం డయ్యు నజడజాతాశ్రయుం డై, ధర్మనందనుం డయ్యు ధార్తరాష్ట్రసేవితుం డై, యకమలాసనుం డయ్యును జతురాననుం డై, గోకర్ణశుగరణి సదాభోగంబులగు భోగంబుల విలసిల్లుచు, నఁవవలె నిత్యంబు సత్యంబుం బాలించుచు, బిడౌజోనుజనియోజ నిరంతరలక్ష్మీసంగతుఁ డగుచు, ధనవాఘువిధంబున శివాదృతుం డగుచు, నెక్కుడేఁడుఁటు బుడమిఱేఁ డై కడు వృద్ధి నొందఁగలఁడు ; కాన నీ వియ్యోడ నద్దంబుల నొద్దు పలుకకుము. దీన నీబిడ్డకు దొడ్డతనంబ వాటిల్లు" నని వక్కాణించెను.

అంత నమ్మంత్రిసుత్రాముని భాషణంబులు కర్ణాభరణంబులు గాఁగ నక్కుమారుని మంగళపదంబులకు సంగంబులుప్పొంగ, నంతరంగంబున నివ్వెఱఁగులు నివ్వటిల్ల, నద్దేవేరులు సర్వజ్ఞునిఁ గని యి ట్లనిరి.—"ఓయూ! నీయుల్లంబున నిమ్మంత్రివరుఁడు నిక్కంపు మిన్కులాఁ డను నిక్కువంబు చెక్కుచెదరక వెక్కసంబుగ లెక్కింపదగి యుండె నేని, మక్కువతో నక్కుమరుని నిక్కడకుఁ దోడ్కొని యేతెమ్ము. ఒండేని యతనినుడువులకు ననుశాసనంబు లయిన వచనంబుల చిన్నంబు చెన్నుగ నొందించుము" అనిన నాసర్వజ్ఞుఁడు మితిలేని యాదరంబుల వర్ణింపఁ దరంబులు గాని యాభూవరవరవర్ణినుల వ్యాహారనిర్ఝరాహారధారాపరంపరలచేఃబరంబుగఁబరానందానుభవంబు



నొంది, యానయంబు వినయంబుచేఁ దన శయకుశేశయంబులకుఁ గలికాదళవశంబు సేయుచు "ఓసత్తము! సమ్మాన్యమతులారా! దేవేరులు మా కెల్లపుడు నిక్కంబుగ మాతృతోషదంబుల. ఇత్త్రికాలవేది సాభిధేయనామధేయుం డగుట మహాయోగి మహిమాస్పదుండ. మే మందఱ మేలికసానులకు విధేయతా భాగధేయంబుఁ గోరుచు నున్నవారము. కాన దేవేరుల యనుమతిలత యిమ్మాంత్రి వరుస మంత్రదోహదంబుచే వర్ధిల్లి యెల్లవారలయుల్లంబులకు నమందంబు లైన యామోదంబుల గఁదళింపంజేయ వెరవరి యై యున్నయది. మన మందఱము వారల సాదరసల్లాపకుసుమవిసరంబులకు నిందిందిరంబు లై యున్నవారము; గాన దేవేరుల చిత్తవృత్తియ ముత్తెఱంగులఁ శుభసంధాత యగువిధాత యని వచించెను.

పదంపడి యాదేవేరులు సాభిలాషంబుగఁ దన్ను నీక్షింప, నమ్మంత్రి యాహిరణ్యగర్భునిఁ దోడి తెచ్చుటకు సర్వపరిజనంబుతో నుచితయానంబు నంప, నాహిరణ్యగర్భుండు విదితరాజసతీశాసనుఁ డై, గ్రక్కున నప్పల్లకి నెక్కి యెక్కువైనయుత్సాహంబుతో మంజుమధురస్వర మనోహరంబు లైన వివిధవాద్యంబులు సెలఁగఁ దత్తత్సేవకులు స్వోచితక్రమంబులఁ బలసిగొలువఁ దదీయాస్థానాంగణంబున యానంబునం గృతావతరణుం డై సవినయంబుగ నద్దేవేరుల కడ కేతెంచి, నిజజననీనిర్విశేషంబుగ వారలకు జోహా రొనర్చెను. వారలు దదవసరవిదితసుతవదనదర్శనసంభవదుల్లాసమానసలగుచు, నాతని నత్యాయతమహిత జీవితుండ వై శచీకాంతునిరీతి నిర్దేశంబునాకంబుంబోలి నిస్సపత్నుండ వై పాలిం

వుమని దీవెనకిటుకునఁ దమనియమంబులఁ దేటపరచిరి. పదంపడి యప్రధానప్రముఖనిఖిలమహాజనంబులకు యథార్హంబుగ జోతలొసరింప, వారును నుచితంబులగు రీతుల నాతని సన్మానించిరి. పదంపడి సభాసదు లాహిరణ్యగర్భుని వివేకాదిగుణంబులు యావజ్జనంబునకుఁ దెల్లం బగుటకై ప్రస్తావవశంబున నుపన్యసించిరి. అంతట నాతండును దండితనంబున వితండ గాకుండ, గండుమీలు నయ్యండజాతప్రకాండంబులకు నవ్యభిచరితహేతుకలితంబు లైన యుదితంబుల సంతంత బగు సంతసం బొనర్ప నప్పలుకు లవ్వేలందు లాలించి, చింతలం జాలించి, మించిన హాళిం గాంచి, యస్మదీయ పురాతన సుకృతవితానంబున నిట్టి సుగుణంబులకుఁ బట్టగు బలుదిట్టయైనపట్టి నెట్టకేలఁ గంటి మని, వేమారు మానసంబుల నగ్గించి, మంత్రినింజూచి, ఓయీ! యీబొట్టె మావేడ్కలకుంబెట్టె. ఎవ్వియు నట్టువడకుండ నిప్పట్టునఁ బట్టంబుఁ గట్టుటకు నెల్ల గట్టాయితం బొనరింపుఁ డనిరి.

## హిరణ్యగర్భునకు విహగరాజ్యమునఁ పట్టాభిషేకముఁ జేయుట.

పిమ్మట నమ్మంత్రి యమ్మానవతుల నానతిం జేసి సమ్మానం బొప్పగ నరసురలు వీడి, వెంవులగు చెలిమరులును నిజభుజాగ్రజాగ్రన్మహాసిభుజగ నిష్పీడితపరిపంథిజనప్రాణవాయువులై యేలిక కెప్పుడుఁ బ్రమదసంధాయిగుణ సమవాయు లగు దళవాయులును, మఱియు నమితహిత పురోహితసామంత ప్రభృతి ప్రకృతి వితతులును బరమానందంబు నొంద, నాహిరణ్య



గర్భుని దైవజ్ఞోపదిష్టం బైనకల్యాణ దిష్టంబునందు సకల జలచరపతద్వితానరాజ్యసంపత్తికి నేతంగావించి, యత్తఱి నర్హులైన వారలకు యథోచితంబుగ నయ్యై వసదనంబు లొసంగి దొసఁగుపాటులు బొనఁగనట్టు లయ్యై యవినీతులఁ దగిన యుపాయంబుల వినీతులం జేసి, యందఱకు మెచ్చగు హెచ్చరికం జేసి, యద్దేవేరులకు దద్దయు సంతసంబు సంధించె. అంత నొక్కనాఁడక్కడింది దిట్టయగు నప్రగ్గడతలకట్టు వెరవరితనంబులకుఁ జాలఁబట్టయి నట్టులేక పట్టంపుదొరల కర్జంబులు మట్టువడనట్లు తనగట్టితనంబునన పట్టువడఁ జేయఁ జాలునట్టి జెట్టియని నెట్టనఁ బరికించియు, నెట్టకేనియుఁ గొట్టుతనంబునకుఁ బట్టగునో యని తలంచి, దానిం బోగొట్టుటకు నద్దిట్టతనంబు నెల్లప్పుడు బెట్టిదంపు కట్టుకు సొట్టువడక మట్టువడియుండ నప్పంటలవాల్గంతేని పట్టికి నయ్యై నయతంత్రంబులు దిరంబుగఁ జూపట్టునట్లుగాఁ గఱపనమకట్టి యేకాంతంబున నతని కిట్టు లని వినిచె.

## మంత్రి హిరణ్యగర్భునకు రాజనీతి నుపదేశించుట

ఓపట్టీ! నీ వఱయఁగ నఱయంగలవాని నన్నింటిఁ గంటనఁటిన దంటవై యే యున్నాఁడవు. అయినను వఱియగుట దార్ఢ్యాదినిమిత్తంబుగఁ జెప్పెదను. పరికింపగ నవ్విజ్ఞానంబు సత్పదార్థప్రకాశకం బగుట, సకల సాధువర్తనంబులకు సంకోచకరంబు లగుటఁ దమంబులంబోలు తమంబుల దమియింపంజాలుట, నల భాస్వంతునిభంగి యుదుటుతనంబున కునికిపట్టయ్యెన, దెలవరు లయినవారి యాత్మలను దొరతనం బొకానొకప్పుడుఁ బెచ్చుపెరిగి యలగాముల జేని హామానింబోలి నావ

రించి, యుద్ధి లేనివానికిఁ దద్దయు సుద్దిసేయును. ఇద్దొరతనం బబీజం బైన కలంజంబు! అద్రవం బైన కాదంబరియు. అశివ ప్రీతికరం బైన మాతులపుత్రకంబు. మాధుర్యధుర్యం బైన యల కృష్ణావధంబు! కాన నెట్టిదిట్టలుఁ దొట్రుపాటు లేక కట్టాయితంబున దొరతనంబున సురుదరులై యుండఁదగును. సామం బను నుపాయం బెల్లనయంబులఁ గలుగునాయతులకు నిలయం బగుచు నయంబై యుండును; కాన నెత్తుకే దత్తరపాటు నొందక, తన సత్త నత్తమిల్లఁ జేయక, మెత్తని చిత్తంబున దాని హత్తింపవలయు. మఱియు దండంబు మెండుగఁ దీండ్రం బై గంతుతీసంబున నొడల్దాల్పుపిండువులకుఁ బండువు గాక కానంబడును. అయిన నద్ది లేకున్న సామితనం బదనంబు కాఁజాలదు. మఱియుఁ బ్రజలయెడల సర్వంబుగ నుండెనేని, పండువులఁ జేయుచుండు. అట్లగుటకు నిదియ పట్టగు తార్కాణంబు. కటుశలాటువు వికటంబుగ గాటం బగు కాటవంబునకు వాటంబై యుయ్యె వస్తువులకుఁ జవుల మిగుల వెలింగింప నింపుగఁ గూర్పంబడి, తాన దొర యై యుండును. అయ్యుపాయ చతుష్టయంబునందును బూర్వపూర్వంబ పూజ్యతమంబు. కావున నేలిక దేశకాల ప్రతిభటపాట వాదికంబులు గూటంబులు విడిచి, సూటిఁ బరికించుచు, సరియైన తఱియందు వెరవుగలిగి బిరుదు సెడకుండ సంఘటింపవలయు. తేఁ డనువాఁ డెల్లెడలఁ బంటులఁ బంటువులు సేయనోపి, జంగమత మిగుల మంగళం బగు నొక శాఖాంగంబు. దానికిఁ బ్రకాండంబు, మంత్రి. తనప్రజల మూలంబులు. కరితురగస్యందనాదివిభవంబులు పల్లవజాలక్రుసవశలాటుఫలా



యమానంబులు. నయంబ శోభావహం బగు దోహదసందోహం బగు.

### రాజునకు కామాదివ్యసనము లనర్థకరము లనుట.

ఇద్ది బుద్ధియందు బద్ధుగాకుండ నునిచి మనిచి వర్తించువాఁడు నిరంతరం బనంతరంబు లైన ఫలభరంబులఁ గొఱంతివడక గరంబు నెల్లవారికి సేవనీయుం డై సంపదలఁ బెంపొందుచుండు. మిక్కిలి చొక్కంపుఁదనంబుల కిక్కలై, మక్కువలీనువాజంబు లైన గోనంబులఁ జెన్నుమీఱు నయ్యై విషయవ్రాతంబుల నిరాతంకంబుగ నయ్యై యింద్రియనిచయంబు గరంబు దిరంబైన నయ్యాయనఁబు నూదంటుకట్లంబోలి చెఱచెఱఁ దమత్తునకు నునికి పట్టగు మనంబు దిక్కువలన నక్కటికిఁ బాసి తీసికొన వమ్మనఁబు నుమ్మలికం జెంది వెఱకిన్రమానుగల పుడమియొడవుగ నమ్మలంబోలి విదళిత మై సౌమ్యసిలి నమ్మిక సెడి, తాను వానికి ననుంగుతనంబు నొంది, విషవిశేషతావిషయంబు లగు విషయంబులఁ జెందిచిక్కువడి, పిక్కటిల్లిన పెక్కుదుక్కంబులచే మిక్కిలి స్రుక్కుచుండును.

వికంకటవిటపిశాఖాగ్రజాగ్రత్ఫలంబుల చందంబునఁ దమ యందంబుల నమందంబు లగు నానందములఁ గందళింపుచు నందుకొనుటకుఁ బొందువడనట్టి, సుందరంబు లగు వరతంబులంగని యనవరతంబు విరతంబు గాని తత్పరతఁ జెంది కందిఁ, తొందరల నొందుచు బందలంబడిన యుల బల్మేని మొకంబు లుద్దిగలబందలయుంద మందు లగు వారు విందులకుఁజెడి తుదకు గ్రుందుదురు. కాన సమస్తంబు లైన కస్తులకును ధామం బగు కామం

బునకు లోఁబడక యుండునది. కామపదార్థం బిచ్ఛామాత్రం
బయ్యు ననంతశృత్రుగణాంతర్గణితం బగు. అది జనస్థాన వనేచరాది
శబ్దంబులఁ దత్తద్విషయ పురుష విశేషంబులంబోలి స్వవాచక
శబ్దంబున యౌగిక రూఢత సంభోగ విషయతర్షాకార మాత్రం
బై నెగడు. అద్దియుఁ దన శుద్ధి యగు నాశ్రయంబు గల దేనిఁ
దద్దయు ముద్దులంబొలిచి స్వవిషయంబులకు విశేషంబుగ నిర్వి
షయంబున ననిమిషవిషయంబున సన్మునీషాభాషితు లగు సం
ఖ్యావత్ప్రముఖ్యులచేఁ బ్రఖ్యాపింప నర్హంబు లైన సత్ఖ్యాతివిభూ
తుల మిగులఁ గలుగఁ జేయు. నీచవిషయం బగునేని వదియా
దిగఁ గడు మొం డగు ముక్కిడివాడుకఁ బదంపడి పెఱజగంబున
గోరగింతల నంతంబు నొందవియు, నైపనోపనివియు నైన గొడ
వలకు మాఁకగు లగు. కాన, జనుష్మంతుండు సంతతంబు విజ్ఞాన
చక్షుష్మంతుం డై నెగడవలయు. అట్లుగాకున్న నెట్టిదిట్టయైన
నట్టువడనిక ట్టంగదలకుఁ బట్టగు. అ దెట్టనిన:—

## కామవ్యసనాభిభూతుఁ డైన నహుషునికథ

✓ మున్ను నహుషుం డను రాజర్షభుం డొక కతంబున
నమ్మోయివేఁగఁటిజెట్టి గట్టితనంబు మట్టువడిపట్టుసెడి యొకమం
తనంపు తావునఁ దాగియుండ, నత్తెఱఁగంటిదిట్ట లందఱును
దమకు ఱేఁడు గానఁబడకుండుటకుఁ గాసిలి, వాసిగల యొకని
నాఱసి యవ్వానికి వాసవీయవైభవావాసంబు సేయసమకట్టి,
యట్టి జెట్టి యెవ్వం డొకో యని కడుం దడవి, పదంపడి ము
న్నుచెన్నుగ నన్నిటి దిన్నన లగు మన్ననల మిన్నంటియుండు
టఁ బరికించి, తా నర్హుం డని మెండుగ నిశ్చయించి, తన్నుఁ



దోడ్కొని యమానవమానంబునఁ దత్పదంబున నునుపఁగా,
దివసం దనపంపునన సర్వంబు నిర్వహింపఁబడుచున్న దని
యతండు గర్వించి, శుచిహేతివోలె శుచి యగునాకేశచినిం గా
మించి, మించినతమకంబున వినయంబు నొంచి, సంచితం
బైన తన విజ్ఞానప్రపంచంబుఁ బొలియించి, యంచితవ్రతయైన
యాపె నాపంచశరమహంబునకై రహంబున నాహ్వానింప,
నాకెగరంబు పతివ్రతాతిలకం బగుటచే, వెరవున నతనినిర్బం
ధనంబు నిర్బంధనంబుఁ గావింప సమకట్టి, "యోదిట్టలతలక
ట్టా! నాతట్టున నిట్టివు పట్టువట్టుట యిప్పట్టునంపు దొరతనం
బునకుఁ గట్టుసెడనిదియు. కాన నీ పోకట్టుఁ జేసితి వేని, నేను
మిగుల సంతసించెదను. నీకును సకలలోకపాల సంస్తవ్యం
బగునీభవ్యంబునకుఁ గొఱంత లేకుండును" నావుఁడు నన్న
హుషుండు నిండగు వేడుక గండుమీర నప్పడంతి కిట్లనియె.

## శచీదేవి నహుషుని యుక్తితో వంచింపఁగాఁ బామై పోవుట.

ఓపులోమకులమణిదీపికా! నామహిమంబు సకల నిలింప
కులకు విదితం బగుట నే నెన్నఁ బని లేదు. నీయిచ్ఛ నిచ్చలు
వాక్రుమచ్చపుము. చెచ్చెర దాని హెచ్చుగ మచ్చికచేఁ గావిం
చెద ననియె. పసంపతి యయ్యింద్రాణి గుణసింధు వగుట,
నాసింధువు దనయంతరంబున మిగులఁ బ్రజ్వరిల్లు బడబాగ్ని
బాతి నద్దురీహునంపలి రోషం బుపహ్నావించి, ప్రియుచిహ్నాం
బులు దనమోమునఁ దోఁప నిట్లని నుడివెను:—ఓమహా
భాగా! సకలభంగుల నన్నాకపాలునకు వారక దొరయని లో
కంబులచేఁ బెక్కుపోకల గొండాడఁ బడుదువు; కాని యొక్క

మంటలఁ గంటుదనంబునఁ దనశిరంబు నొక్కొక్కటి నొక్కటిక విడిచి కడు బెడిదం బగు నడిదంబునఁ ద్రుంచి వ్రేల్చి, కట్ట కడకుఁ బదియవ దగు దలఁదరగ నుత్తుకుండు గాఁగా, దెలిసి యన్నలువ మిగుల వెరగందుచుఁ గందివడెందంబులోఁ దనవ్వేళ వైళంబుగఁ గన్పట్టి, హా శెట్టీ! ముద్దుల పట్టీ! బెట్టిదం బగు నీపట్టుకును గట్టులరేని దట్టింపఁజాలినట్టి గట్టితనంబునకును వట్టువడి, నీచెంత కేతెంచితిని; కాన నీజతనంబు నుడుగుము. వడిగ వేఁడుము. వేడుక లలర, నీ క్రచ్చుల నిచ్చలుగాఁ జెప్పఁజాలున నిచ్చెద ననుచుఁ జెచ్చెర దశముశిరఃఖండన వ్యగ్రం బగు భుజాగ్రంబు పట్టుకొని యుపలాలనంబు సేయు, నాయూఁదుబాహుశిఖామణి గర్విష్ఠుం డైన పరమేష్ఠిమనుగ్రహంబుఁ బడనగ్రహంబు గాన సెంచె.

గర్వితుండై రావణుఁడు లోకంబుల జీకాకుపఱచి నశించుట

అట్టిమహానుభావుం డగు పంచాస్యకీర్తిసంపన్నుం, నిజ గుణాలంకారరాశిసముద్భూతం బైన యశోవిశదాంశు బింబంబునకుఁ బరకామినీకామనావశంబునఁ గలుగు కలు షం బనునంకంబునఁ బంకంబునఁబోలె బింకంబు గల పాంకం బుల సుకృతవంబున నిలికించె మఱియుఁ బరమ సాధ్వి యను పప్పుఫ్త్విజని జగజ్జనని యని యెఱిఁగియుఁ గామజనితవిస్మృతి వినసుం డై ప్రమదప్పనచ్చునఁ దొచ్చంపుఁ బనంబునకు నచ్చ వడి ప్రుచ్ఛిలించి పదంపడి, యాపె యుసురుల యేలికయగు నప్రచంత ఖండపరశుకోదండఖండనకళాపండితునిచే ఖండ ఖంబున సాప్తమంతలుండై ఖండింపఁబడియె.

ద్రోవదిఁ గామించి నశించిన కీచకునికథ

మఱియు సార్థాభిధానుం డైన సింహబలుం డను రాజ వేదండనాథుండు సైరంధ్రీవర్తనంబున నున్న యద్ద్రౌపదీ పురంధ్రీమణిఁ గాంచి, కామించి దీనివలన నీకుఁ జావు వాటిం చుఁగాన వల దని మరలించినను వినక, అలవలపుల యేలిక కలనికి మిగులఁ బలుతేపలు జతనం బొనరించి, తదీయరమణుండు హిడింబకాహిప్రవరగరుడుం డైన ప్రాభంజను నిచే భంజింపఁబడియె. ఇంతియ కాదు. మఱియుఁ గోటాన కోట్లు బెట్టినం బగు గామంబునకుఁ బట్టువడి. మిట్టిపడుచుఁ దిట్టతనకుఁ గుట్టువిడి నెట్టన నప్రోప్పను నప్రోప్పపట్టియుం టికిఁ బట్టెను. కానఁ గామంబు నెల్లతెఱంగుల ఒగ్గుకోరు వారలకుఁ బూనరాని దని యెఱుంగునది.

క్రోధదోషము నుగ్గడించుట వాలిసుగ్రీవులకథ.

✓క్రోధంబు నాఁ బరజఘూంక మై పౌనంగు. అద్ది యర్థా ద్వేషణ విషయం బయ్యెనేని, విజిగీషువకుఁ బౌరుషంబు నశేష శేముషీమన్ననీపానికాషంబుగా విశేషింపఁజేయు. కాని నాఁడు తనయిరవుకు నుసు లైన వంతల గంతలకుఁ జేర్చి పంతం బుగ నంతంబు నొందించు. తొల్లి గట్టులంబట్టి చట్టువులఁగొట్టిన యజ్జెట్టికిఁ బట్టియు, గట్టు దెగినట్టు గట్టితనంబునకు నునికి పట్టును, బద్దిట్ట లగు నెల్లచెట్టులమనికిపట్టులకు నొడయుం డును, నగు-వాలియనువాఁ డొకండు మిగుల దండిమగండు గలఁడు. వాఁడు దట్టంబు లగు తన దిట్టతనంపు గొనంబులఁ దిట్టల తలపుట్టలమనికిపట్టులదిట్టకు నైన నెట్టకేనియుఁ దము

నటులఁ జెప్పెదనాకర్ణింపుము. ఒకతఱి సకలపరిపంథిహృదయ నిర్దళన పటిష్ఠ గరిష్ఠ భీషణహర్యక్ష ఘోషణంబుల నల దుందుభిఁ బోలినవాఁ డగుటచే దుందుభి యను పేరఁ బరగి నవాఁడును, మయుం డనుదనుజునకుఁ దనూజుండును నగు నొక్కరక్కసుఁ డక్కజంబుల కిక్కయై, మొక్కబోక పెక్కుపోఁకలం జెలఁగి మిక్కుటం బగు తనయుక్కుతునక తనంబున నల్దిక్కుల నొక్కఁడునైనఁ గదనంబునఁ దను నొక్కించి మక్కువఁ జెంపెక్కనో యని, పెక్కుమాఱులు వెక్కసంబు లాడుచుఁ ద్రిప్పుతనంబునఁ గ్రుమ్మఱియు, నక్కడక్కడఁ బెక్కంగ్రపు దనబీరంబునకు గోరంబుసేయఁ దొణంగి, మున్నింటి దంటతనంబునఁ గంటుమీఱి పోరుటకు రా, వెంటన యాబంటుల నంటి, చెలాటము నంటించి, పెంట లపాలు సేయుచు, భుజగంబులకుఁ గంటకంబు కరణిఁ గను గంటకుండై దోర్దండంబుల నడఁగాఁ గొని, కొండలంబోలి గండుమీఱెడికండూతి గండింపంగల నడిమగంధోకండైనఁ గన్నులకుఁ బండువుగాఁ గానంబడకుండుటకు నింపుగ గొండ గుచుఁ గుందుచుండెను.

— { నారదమహర్షి ని దుందుభి తనతో యుద్ధము చేయఁదగినవీరునిఁ జెప్పు మనుట. } —

అంత నొక్కనాఁడు దివినుండి వేంచేయు నయ్యంచల కవ్వాకుబాబాకన్నతపసితేనిఁ గని, మంతగువేషుకఁ బొంది తనయొడలు నిండుగఁ బుడమి నండఁగాఁగొన నతని యడుగులఁ బడి దడ వుండె. వెండియుఁ బండువెన్నెలలఁ బిండువుల. గండుఁడనంబుఁ జెండింపఁ జాలిన లేనగవున, దిశ లెల్ల



విశదంబులుగా నొనరింపుచు, నప్పాండురగరుడండజమండ నవాహనుండుకన్నకొడుకగు నారదుండు గారవించుచు సేమం బడిగిన, నక్కాండదిండులదండినుగండు మెండుగ దండంబు లిడుచు, నమ్మునిప్రకాండునిచెంత నిలిచి యిట్లని విన్నవించె. ఓయయ్యా! నీవ ముల్లోకంబులఁ గల దపసులందఱిలో,రిక్కలలోన నల జక్కవకవలమక్కువలఁ జిక్కు బరపుగాముల యేలికంబోలి వెలుంగుదువు. నీయక్కటికను జుట్టుఁ గూడి గట్టిగ లగ్గులకుఁ బట్టగుచుఁ దిట్టతనమ్వలని గన్పట్టుచుంటిని; కాని నాచండలకండూతి నెవ్వనిచేతఁ బొందు పడక గండుమీఱు నరిగండతిరతనంబునఁ గండరించు. దీనికి గండంబుసేయఁ జాలిన దండిమగం డెవ్వఁడేని నెక్కడ నేని నుండిన, దేవర యానతీయుఁడని కడుగండ్రతనమ్మున నేఁడిన, నజ్జతనమ్ములయిమ్ము గొంతవడివు పరికించి వెండియు నతని కిట్లనియె.

— వాలిని ప్రతివీరునిఁగా నారదుఁడు నిర్దేశించుట. —

ఓయి! నీకు మాఱొక్కఁడగినట్టి జట్టికంపుజెట్టి పేఁగంటి పట్టి నొకని గట్టిగ నే నెంచెదను నీ వాతనితోడఁ గడంగి దురంబునకుఁ గరంబు పొందువడి తేని, గ్రక్కున నీక్రచ్చ పెచ్చునెరిగి మీఱఁదగునని పలికి యానిరాబారితేఁడు పంచ బంగాళ మయ్యె. అంత వాఁడును నెట్టన నంతసిల్లి, యాలంబునకుఁ గట్టాయితం బై, గట్టులఁగొట్టుజెట్టిబోట్టికు మనికిపట్టగు కిష్కింధానగరంబును చేరఁజని, యట నక్కోటవాకిట నిలిచి, యులచదలు నిలువలేక, తద్భయంబున మిగుల మీఁదు గంబాఱఁ దనయడుగుల నిడుటలఁ ఖుడమియు వడ వడ వడం

## వాలిదుందుభుల ద్వంద్వయుద్ధము.

అంత నవ్వానరవీరుఁ డతిధీరుఁ డగుచు నాయసమునలా గ్రపాతంబు ననుకరించుతనపిడికిటఁ గొట్ట, నయ్యురువడి నతి కోపితుం డగుచు వెనుకకుఁ దూలి నిలిచి, భళా! సెబాసు! ఓహో! కొంతవట్టుకు నీవు మగటిమికిఁబట్టు గాఁ గలవాఁడఁ వని నుడివెను. ఎన్నినాఁడులకు నీవంటిబంటుఁ బొడగంటిని! ఆహా! కా నిమ్ము వెంట నంటెన నొద్దు కొను మని, చప్పున యుప్పరంబున కుప్పతించి, నిబ్బరం బగుహబ్బు మిగుల నుబ్బి, గుబ్బలిసిగరంబునఁ బిడుగు ప్రేయుకరణి గబ్బి తనంబున బొబ్బరిల్లుచు గొబ్బునఁ దనముష్టిఁ జతని మస్త కంబు నిస్తులతఁ దన్న, నక్కొమ్మల ప్రిమ్మరి పెట్టి నెమ్మనం బున సొమ్మసిల్లి, యొక చిటికపాటునఁ బెండియుఁ దన్న, సన్నా హం బొసరించువానిముంగాళ్లు రెండును రెండుచేతులఁ బట్టి క్రమ్మఱఁ దన్న వాఁడును దన వెన్నదాఁకున నహ్నంటి క్రొల్లం టిబోటు బటుబటు బగుల మిగుల మోఁదుగఁ గాళ్లఁ గొట్టికొ నుచుఁ గొంతవట్టు మొట్టుపడిననట్టితనంబు గలవాఁ డగుచు, నిట్టూర్పులిడ్చుచున్న నక్కొమ్మ క్రిమ్మరిమంట తనవెంట నక్కటికంబూని కనుచుండ, దిగ్గున దిరిగి నిజాకారవరాభూత సాలమ్మగు వాలమ్మున నిమ్ముగఁ బ్రేపిన, నత్తిమ్మనసామి యుమ్మలికఁ జెందక సైరించి, యవ్వాలంబు వెనుకటకఁ బట్టి కొన వాఁడప్పట్టుఁ దప్పించికొని దట్టించి మురల నెడు రై పొం చి సూటివాటించి, తన విషాణమ్మునఁ బరుషమ్మగు నతని యురఃపాషాణమ్ము విదళింప, నతండునుఁ దద్వ్రణంబున నవ్వ నరంపత లురువు లై నిర్గమింపఁగా, జగదవసాన సమయంబు



వఁ దదపాయంబు సూచించుటకై శోణితవర్షి యగునలబల ధరంబు ననుకరించుచు మెండుగ బెండువడి కడుడస్సె.

అంత వా రిరువురు నరి గానని సమరసంరంభంబునఁ దలంబులఁ గొట్టుచుఁ, బదంబులఁ దన్నుచుఁ, గూర్పరంబులఁ బొడుచుచు, నఖశృంగంబులఁ జీరుచు, దంతంబులఁ గఱచుచు, దృఢాంగంబులఁ దాఁకుచుఁ బోరుచుండఁగా, నత్తఱి నక్కుంభతిండికాడు వేల్పులచేఁ జెడిన నత్తిమ్మపూర్వంశబండారంబునఁ గొనంబడిన యకదండితనంబుగలాఁడుగావున, బెండువడి యాతనిఁ దప్పించుకొని మిగులవేగంబున నక్కడి కొండకడుపులోనికిఁ బాఱిపోయెను. ఆయ్యెడ నాశాఖామృగశిఖామణి విజయాలక్ష్మి సహాశ్రేనకర్మవిన్నప్రేరణ క్లేశుం డయ్యు, శత్రోశ్మసం స శేషశేష త్తన నీతివేత్తల యుపదేశంబుం దలఁచి, తనయంత నంపునెయ్యకప్పుసైఁబోనిరో నిట్లనియె-ఓరిమ్ముఁడా! పేఁడిప్రను బెండువడి యెకాహాటించె నని విడువఁబడినవాఁడయ్యె నేని, మఱుఁడ నీగి నేయుఁగలంపు కాన వీఁడిపోఁడఁ గలసి మిగులతపోరి హారినగతి నసపలమను. అట్లు చేయుటకు నే నొక్కఁడన చాలుదు. కాన నీ పిగ్గుహాప్రతీహారవతుణము నొనరింపుము నుండు మని యాతని నచ్చట నియమించి, కొంతకడవు నేన దీక్ష్ణకొనుచుండె.

## దుందుభి స్వకర్తవ్యముఁ జింతించుట.

వాఁడును నాకందకోదరంబు సొచ్చి యొక్కింతతడ నేదఁ దీర్చికొని, యవ్వాలిబలంబుఁ దన నెమ్మనంబున నిమ్ముగ నెన్నుచు, సారెసారెకు బీరంబు ఘోరంబుగఁ గైవారంబు సేయుచు, నల్లంబున ని ట్లని తలంచె—"తొల్లి నా బింకంబు

అంతనంతలకు రాని దగుచు నింతవ లెల్లం గొంతవడక పొం-
కంబలర వల పెంకెలనెల్ల మంతుతనంబున నింకింపం జేయఁజాలి
యుండియు, నిపుడు కొంతలకు నింత వగుటం జేపట్టెను.
అకటా ! నే నెంత ముక్కిడితనంబున కొడఁబడితి? లావరుల
కిది దగునే ? మనుతతి గలిగె నేని, బీరంబున నెరవేర్పరాని
కర్జంబులు గలవే? ధీరు లగువారు దమకుఁదగిన ప్రతిమల్లుఁడు
గన్పట్టె నేని, వానితోడఁ గలహచ్ఛలంబునఁ దుచ్ఛం బగు
నీమేను మానింపక యచ్ఛంబగు యశంబుఁగోరి సనాతనం
బులు సద్దివ్యయశోమయంబులు నగు కాయంబు లందఁగోరి
పరతేజంబున నొడుచియునుఁబోలి వ్రేల్తురు. మఱియు 'సంభా
వితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే' యను యభియుక్తులు
దమసూక్తులచే ముక్తాసరంబులఁబోలె ధీరులహృదయంబుల
నలంకరింతురు. ఇక్ష్వాకుడులు గల నయంబులెఱింగియు సమ
యం బైనచో నియమంబువాసినయెడ యశోధనులు శోధనంబు
సేయువేళ నీ యనరే? కాన సంగరంబునకుఁ బొంగియుండుటయు
యంగవలం జెందనిసంగళం బగు. అయి వుండె నేని, విరోధిని
శిక్షించి, విజయలక్ష్మితో హాళి నుండెద. కావున్నఁ బ్రదశ
నివేశంబున నూర్ధ్వశ్యాది స్వర్వేశ్యా కైశ్యావిరళ గళ
త్కల్పప్రసవసంతతశయ్యావాసుసుఖంబునకుఁ బాత్ర మయ్యెద."

## దుందుభి మఱలఁ దలపడుట.

అని తలంచి, మించిన బీరంబుతో మఱియుఁ జివ్వకుఁ
గాలు దువ్వుచు సంవర్తసమయసముద్ధతి మహాధ్భుత ఘటా
సంఘటిత భిదిర భైరవం బైన హార్యతు నిర్ఘోషంబున నక్కొండ



దండలు బిండిగాఁ బగుల, నారొాధనంబునకు నారాధనంబు
జమాలికా విలసద్వక్షుఁ బిలిచె. అంత నవ్వానమ్మగశార్దూలుం
డకుంఠసత్వ సంపన్నుం డై, కంఠీరవంబు పై నెగయు భీషణ
శరభంబుఁబోలి, వానిపై లంఘించె.

## వాలి దుందుభివెంటనంటి గుహసొచ్చి మఱల రాకుండుట.

అంత నయ్యిరువురు నురుతర దారుణ సత్వప్రకాశంబులఁ
బెంపెసఁగు నొండొరులఁ బరిమార్ప నుద్రేకించి, కొండలంబోలి
దాఁకి, యొండొరులమీఁద గండశిలలఁబోలు పిడిగ్రుద్దు లిడుచు
ప్రచండ వేదండంబులలీల గండుమీఱి, కరంబులచేఁ బ్రహరిం
చుచుఁ గంఠీరవంబుల హేల బలసిన యుత్కంఠ నఖర్వఖరతర
నఖర శిఖానిఖాత ప్రతీక రేఖా సముద్గీర్ణ సముదీర్ణశోణితార్ణస్సం
పూర్ణవిగ్రహు లగుట విజయలక్ష్మీ సంవరణ మంగళాంగీకరణ
గుంభిత శుంభదగ్నిశిఖాంభస్సంభావిత మహాభిషేకతం బోలు
పొందుచు, సాహజికాగంతుక సారాతిరేకంబున నైసర్గిక
తాదాత్వికధైర్యక్రోధ సంధుక్షిత రూక్షకక్షంబున నక్షీణో
త్సాహు లగుచుఁ బోరుచుండ, నయ్యెడ నాఖండల తనూభ
వుండు ఖండనంబున మహారాద్దండతఁ బ్రచండగాం బాటించి,
వెఱవున నద్దుందుభిం బట్టి నచ్చట్టునఁ గొట్టిన వాఁడును
మహాదారుణం బై ననిర్వాదంబుతోడ నిర్దళితకళేబరుం డై
నేలఁగూలినం దదీయాంగరంధ్రంబుల వలన నన్నిష్ఠిత మేదో
లాలాంత్రంబులు చెదరి భిల్లుభిల్లున నేతెర.

## సుగ్రీవుఁడు వాలిని హతుఁగా శంకించి గుహాద్వారము మూసి నగరునకుఁ బోవుట.

అత్తఱి నరోత్తమసుతుండు వినీతుం డయ్యు, "ప్రేమ పశ్యతి భయాన్యపదేఽపి" యను నయంబున భీకరంబైన పగఱ యారావంబు చెవిసోఁకుటయుఁ బ్రహారకార్యంబు లగు తత్తత్క్షతజాంభః ప్రభృతి సముద్గారంబు లేతెంచుటయుఁ గని, దన యన్న యే యన్నల్లబీల్చెడి మల్లునిచే సమయింపఁ బడె నని గడు సడలి, మఱిమఱి యడలుచు, వాఁ డందునుండి వెడలి తన్నుసైతము గసిమసంగఁగలం డని మెండుగ భయంపడి, వాఁడు రాకుండ, మెం డగు నొకబండచే నక్కందరద్వారంబు మూసి, సద్యః కృతావతార మ్మగు వేశాగమ్మునఁ గుందిన డెందంబుతోఁ దననగరి కరిగి, వలిపిరిగొనుతనమోముగనుంగొనుమాత్రం దలఁపునఁ జేరినయుగనియాంగదచే మిగుల వగలం బొగులు నత్తారాది రమణీగణంబులతోడఁ బెక్కుతఱి వగచి, యెట్టకేలకు దిట్టతనంబుఁ దెచ్చుకొని, తగునుడువుల నాపూఁబోఁడులతోడ విలపించువారల నెల్ల నూరడించి, యత్తఱికిఁ దగినకర్జంబు లాచరించి, గురుమంత్రిప్రభృతు లగు నాప్తజనంబులచేఁ దద్రాజ్యంబునకుఁ బట్టంబు గట్టంబడి, స్వకులోచితంబు కాన, నత్తారను బ్రియురాలిఁగాఁ జేపట్టి గట్టితనంబున నారాజ్యంబు నేలుచుండె.

## వాలి గుహనుండి వెడలివచ్చుట.

పదంపడి కొంత తడవునకు నప్పురుహూతపుత్త్రుఁ డవక్రంబైన నిజవిక్రమంబునఁ దచ్చి యుజ్జలమెకంబు బొబ్బమెకంబుఁ



బొలియించుచందంబున గిజగిజ గింజుకొనఁగొట్టి, యయ్యసుర యసురులచేతం బట్టువడం జేసి, విచిత్రవిక్రముఁడగుచు, విజయలక్ష్మీవృతుం డై యద్ద్వారంబు కడ కేతెర, నచ్చట నొక గండప్రస్తరంబు మహాకవాటంబుగఁ గన్పట్టఁ దోఁబుట్టువునందుఁ గట్టలుక వట్టి యిట్లని డెందంబునఁ దలఁచె. అన్నన్న! యిప్పలువ దులువతనంబున నాయాన మన్నింపక, తనమువాళంబ దొడ్డపాళం బని వైళంబునఁ దలంచి, వివృతాస్యం బగు పంచాస్యంబు నెదిరించు కరికరణి, నే నా రక్కసితోడఁ బోరం బోయిన నక్కటిక నైనఁ జెందక, వానికి నను హంతవ్యుఁ గాఁ దలంచి, యిద్దరీద్వారంబున దుస్తరం బగు ప్రస్తరంబు సంస్తరించి, నిరస్తమర్యాదుం డై, వస్త్యంబునఁ బ్రశస్తంబు లగు శస్తంబు లనుభవింప నూహించి, నారాజ్యం బెల్లఁ దాన యాస్వాదింప నెంచి, మించినయాశతో నను నస్తంగతుంగా నిశ్చయించి, యంతఃపురసుఖంబు లనుభవించుచుండును; కాన నిగ్గరానుఁ బరామఁ గావింపఁవలయు నని మిగులఁ గనలి, యబ్బంపఁ బిండి గాఁగఁ దనయడుగునఁ దన్ని, దాన వెలువడి పన్నిన వెగ్గలంపుకినుక గనకనలాడ, క్రేటుఁ గాసిన బెబ్బులిం బోలి, యుబ్బుచు బొబ్బలత్రోవ వగుల నబ్బురంబుగఁ బొబ్బలిడుచు, గొబ్బున నన్నగరి కరిగె.

అంత నప్పురంబున నున్న సుగ్రీవుండు మొదలుగాఁగల వానరు లందఱు, బుభుక్షాయాతహర్యక్షక్షోణీశు క్ష్వేళానిర్హ్రాదంబు లాలించిన మృగంబులకైవడిఁ, దదీయ గర్జాశ్రవణంబునఁ బొడమినదిచ్చపాటున నపహృతహృషీకుల కరణి మూర్ఛావశుల బాతి, నాలేఖ్య లిఖితుల వైఖరి, నూపిరి యేని

విడువఁ జాలక యత్యాహిత సంగ్రస్త చేతస్కులగుచుఁ గింకర్తవ్యతా మూఢులైరి.

సుగ్రీవుఁ డన్నను క్షమింపవేఁడుట,

వాలి నిరాకరించి నశించుట.

అంత సుగ్రీవుండు దనయేమఱికకు మిగులఁ గొంకుచు, బింకంబు సెడి సంకటంబులకుఁ జాల్పడి సాకులత నొందుచు, నొక్క యుసురుతో నేతెంచి, తద్దయుఁ బెద్ద యగు తోఁబుట్టువు నడుగులఁ బడి, యో యన్నా! తెలివిలేమిని నీయెడల నేఁడు కడు తప్పిదం బొనరించితి నని, తన కప్పుడైన వెఱపులాగులఁ బెక్కుమాఱులు నిక్కంబుగాఁ దెలిపి, నొక్కిన యుల్లంబుతో నాతప్పులు సైరింపుము. నే నవివేకంబున మహాపరాధిని. నిను వేసిన యెగ్గు తండ్రి సైరింపఁడేని, నొరు లేరు సైపుదు రేతురు? పుత్రుఁ గఱచెద చెంపలు గొట్టుకొనియెద. నీవు నిశ్చయించిన ప్రాయశ్చిత్తంబు నిశ్చింతతఁ జేసికొనియెద నని విన్నదనంబు జెన్నుమీఱ వాలి కెఱుఁగునట్లు లెన్నివిధంబులఁ బ్రతిమాలినను నతనిజతనంబులు పెచ్చుపెరుగు గార్చిచ్చు బోఁబుచ్చుటకు వెల్లిగఁజల్లిన నీటిబొట్టులఁ బోలి, ముట్టువడని యద్దిట్టకట్టలుకఁ గొట్ట నెట్టకేయు దిట్టంబులు గాకుంటయు గాక, తాపజ్వరభరితునకుఁ గూర్చిన తుహినోపచారంబులఁ బోలి, నిరర్థకంబులుంగాక, విపరీతంబుగ ననర్థావహంబులు నయ్యె.

అట్టియెడ నాసౌత్రామణి యతిభీషణ రోషణధోరణీ శరణుం డగుచుఁ గడుతడవునంగాని వెడలని గాయంబులఁ గడుగాయతనంబున నతనికాయంబునఁ గూర్చి పేర్చి తివ



నాడుబెడలించి, యమలశీలంబునఁ బ్రియమనోరమ యగునారు మనునిజసౌందర్యంబుచేఁ గదర్యలై చేయంబడిన సురవేశ్యలు గలదానిఁగాఁ బరికించి, తనకు వేశ్యంబోలె వశ్యం గావించికొని, యంత నిలువక, నాటఁగోలె యన్నివిధంబులఁ గినుక మాని, జతనంబుచేఁ గనుచుఁ గవినప్పు డెల్లనాని యూపిరికి నెందిరంబు సంధిల్ల జేయుచుఁ గడుఁ గంటునంటి కట్టకడకు మంటంగలసె.

మఱియు నిట్టివార లనేకులు గలరు. కావున, దూర వైరం బేరికిఁ గొఱగాదు. మఱియుఁ గ్రోధంబు నిజఫలసిద్ధి కంటెఁ బదంపడి యొరుల నిగువుల విఱియింపఁ జాలినదయ్యు, నంతవట్టునను నట్టుగొట్టక పట్టువట్టి చూఁట్టరాని దగుచు, ముట్టువడక చిట్ట తనంబున బెట్టిదంపుఁ జేటు చేపట్టి మిట్టిపడుచు, వల నీటిపట్టి కట్టెలఁగాల్చునట్లు తన మనంబునఁ బుట్టి దట్టంపు తలంపులను సుడిగొట్టఁ గొట్టంబడి, యిట్టట్టుపోనీక తనకు మనికిపట్టగునల్లం జెల్లెడలఁ గాల్చుచుండు; కాన దానిని వర్ధిల్లకుండ నిర్నిరోధంబుగా నిరోధింపఁదగు. ఇఁక లోభం బనునది అశోభనంబు. ఎట్లంటె నని యంటి వేని, యాలింపుము.

## లోభదోషము నుపన్యసించుట.

లోభంబు నా దేశకాలాద్యనుకూల్యంబున విడువఁ దగినదాని విడువకుండుటయును, దద్వైపరీత్యంబున నాసింప రానిదానియం దాసఁ జేయుటయు నై పూర్వోక్తశబ్ద వృత్తి విశేషంబునఁ దెలియఁదగు. అద్ది యొక చెట్టగసన్నట్టి విపుల జలాశయంబు. అద్ది యెంతవట్టును నురు వడఁగి గన్నట్టి

నంతవట్టుకును ఘనాత్మతఁ జూపట్టు భాస్వత్కారపరంపరలవలన గరంబు పూరించఁ బడుచుండు. అట్లుండక క్రిక్కిరిసి నీచపదంబుల మెలంగెడివారి యభివృద్ధుల ననిరుద్ధతఁ గని గొనంగఁ జెనంగె నేని, నీరంధ్రంబు లగురంధ్రంబులకుఁ బట్టగుచుఁ, గట్టకడకుం జెట్టఁజూపట్టి, మును పున్న దానినయితము గోల్పడి పిల్వరుచుటలకుఁ జాల్పడలేక, యతిరిక్తత మించు నల యతిరిక్తతతో ననర్థం బగు. మఱియు దీని గొడవఁబడినవా రనేకులు గలరు. వారలలో నొకనికథ సంగ్రహంబుగా వర్ణించెద నాకర్ణింపుము.

లోభదోషోదాహరణముగా మహాభారతకథ నుపన్యసించుట.

తొలుత దేవతానుగ్రహప్రసూతు లగు కుంతీసుతులు పాండవు లనఁబరగి, యుధిష్ఠిర భీమార్జున నకులసహదేవ నామధేయంబుల నతివిక్రమంబు లగు విక్రమంబులఁ, గలువ పరువవిపిన వీతిహోత్రంబు లగు చరిత్రంబుల, సకల సభ్యులగుచు, విలసించుచు నాజననంబు నెల్లవారి యుల్లంబులకు దెల్లంబుగ నుల్లాసంబులు దమవిలాసంబులఁ జేయుచుఁ జెలుగుచుండ, నొక్కకతంబున వారికిఁ దండ్రి యగుపాండురాజన్యశేఖరుండు విగతాసుం డయ్యె. అంతఁ దదగ్రజుం డైన ధృతరాష్ట్రుండు దమ్మునిమృతి విని మిగులవగలఁ జొగిలి, యావల వల నగువారినలన వారినిఁ దల్లితోఁగూడఁ దన దండకు రావించి, కైపుగానిమనుజ నొరులెల్లఁ దనుఁ గొనియాడ మనుచుచుండెను.



కౌరవపాండవుల బాల్యవర్తనములు.

దుర్యోధనుని దుండగములు.

మఱియును దుర్యోధనాది నిజసుతశతంబుతోడ వెండియుఁ బెఱవారితోడఁ గూడఁ జేసి, యస్త్రశస్త్రకళావిద్గ్రిహ మిహిరుఁడైన ద్రోణాచార్యవలన నాలంవుకళలను దక్కిన చదువులెల్ల నయ్యై యొజ్జలవలనఁ గఱపించుచుండె. పెక్కసం బగు నుక్కుతనంబున నిక్కపడు పెక్క లగు మొక్కరులచే గ్రుక్కుచున్న యిక్ష్వాక్వపి బరువుడింప సాంపొంద యదుకులంబున శ్రీకృష్ణనామంబున నవతరించిన భుజనకుంజర హార్యక్షుం డగు నయ్యధోక్షజుని చేయూఁబూనినకర్జంబులకుఁ గరజంబులగుచుఁ బుట్టిన జేజేల యంశంబు లగుట, నప్పాండవుల లగ్గు లగు నెల్లగొనంబులు నత్తఱివారల కందఱకుఁ బెచ్చుగు నెచ్చరిక లొనరించుచు, నక్కుంభసంభవునకు నిర్ధంభ సంభాసమానంబు లగు సేవాగుంభంబులఁ దదుపదేశ గ్రహణ ప్రతిపాదన ప్రముఖ విధి విధానంబులఁ దమహావణిక వెలయింపుచు, మరులు గలిగించుచు, నయ్యైవిద్యలఁ గఱచుచుండ, నాదుర్యోధనుండు వార లట్లుండుట సైప నోఁపక, కుటిలాశయంబున వారలఁ బొలియించుట కై, పిక్కజతనంబు లొనరించె. మఱియు భీమసేనునందు నందఱకన్న నీరసంబు మిగులఁ బూని యుర్యైతఱులఁ ద్రాఁచులం గఱపించియు, బెట్టిదంపు చిలువల చిలుముతోడ మెందుగఁగూడిన కూడులఁ బెట్టించియుఁ గడుబెడిదంబు లగుత్రాడుల దిట్టంబుగఁ గట్టించి యూలఁతి గాని లోతుచే నూఁత గొనఁదగని వరవలఁ బడఁద్రొబ్బించియు, మఱియుఁ బెక్కుబాతులచే మిగుల నెగులులఁ గలిగించె,

అయినను, వారలు దివ్యాత్మకు లగుటం జేసి, యాదుర్యోధనుని చెట్టచెయువులకుం బట్టువ్యను, నెట్టకేని దిట్టతనంబునం జెడరైరి. అంతం గొంత తడవు జరిగిన సందఱును సాంగాధీతసకల కళాలావు లైరి.

### కర్ణునిజననము-రాధ యతనిం బెనుచుట.

మఱియు మున్ను కుంతిచేఁ బెట్టెంబెట్టి దోలుత బార మేసు మేటిగూటమి నొక నిసువు గని, తనకన్నెరికంబునకు బన్నంబువాటించు నని వెయిలోటం జెంది, యొక్క మందసంబున నన్నుంచనుం బెట్టి, దాని జమునవరవ న్విడచి, యప్పదీమంబునం ద్రోల్లి యట్లుండె. పిమ్మట నాపెట్టె నదీరయంబునం జనంగా, సూతుం డను జాలరి యొక్కండు గెండెకెమ్ములం బట్ట వట్టింకికిం బోయి, యాపెట్టెయ చూపట్ట దిట్టతనంబునం జేవరవున నవ్వారిరసం బోరం బాఱి, యప్పెట్టె బట్టి గట్టునకుం దెచ్చి యమ్మూత్ర ననూతం బెకలించి చూచిన, సాజంబు లగు మానికంపు పోగులం గత్తళించిన మెఱుగు కుచ కఱంగిన నపరంజిచే రంజిలంబడినబాతి మిగుల వెలుంగుచుం, దద్దయు న్మెరయు నరుది కలుముల యడియాలంబుల కిర వగు నెమ్మేనం ధగద్ధగాయమానం బగు నప్పాపనిం గని, గనిం గన్నయయ్యెరు పేదపోలిక నగ్గలం బగు బగ్గుచేతం బొంగి, యప్పట్టింబట్టికొని తనయునికి పట్టునకుం బోయి, రాధ యనుపేరం బరంగు తనబోంటి కిచ్చె.

అంత నాపె మిక్కుటంబుగం దనరు నెనరున నబ్బుడుత నెత్తికొనుచుం దనగబ్బిగుబ్బల నిబ్బలంబుగం జా లుబ్బ, లిబ్బిం గన్నదానంబోలి, తద్దయు నంతసిల్లి, యంతకుమున్ను వట్టిం బట్టుటం



బుట్టిన నమ్మదంబునకు నిమ్మ గాని నెమ్మనంబు గలదిగావున, నమందానందమయత నొంది వాండె కన్నకొడు కని యెంచి, మించి, సంచితప్రేమపరవశ యగుచుం బెంచె. మఱియు నంత నద్దంపతులు బెరవరు లగు సొంపులు నింపొందం దమసంతతకు వింతగాకుండ, జాతకర్మ ప్రభృతి విధుల విధివిధానంబులం జేసిరి.

### కర్ణుండు కురుకుమారులం గూడి విలువిద్యం గఱచుట.

### దుర్యోధనుండు కర్ణుంగూడి పాండవుల నమయింపంజూచుట.

పిమ్మట న్వోపమానిభూపకుమారుం డగు నక్కుమారుండు, కురుకుమారులం గూడి వివిధంబు లగు నస్త్ర శస్త్ర విద్యల యం దర్జునుం డొకండు దక్కం, దక్కిన విలుకారులందు దివ్యాస్త్ర విజ్ఞాన హస్త లాఘవాది గుణంబుల మిగుల దండిమగం డని పాడుకం జెందె మఱియు నితండు విద్యాగ్రహణావసరంబున నర్జునుని వెఱపు సైంప నోపకుండుట యాదిగాం గల మచ్చమ్ముల నీతనికి నవ్వివ్వచ్చునందుం దొచ్చంబు గాని మచ్చరంబు వరికించి, మిగుల సంతసించుచు నాధార్తరాష్ట్రాగ్రజన్ముండు మెచ్చుగ వానితోడం బొత్తు హత్తించి, నమయంబైన నాధనంజయు నమయింప నమకట్టి, తనయంగదేశంబు నకుం బోలినయంగదేశంబున కేలికంగాం జేసి, యాత్మీయంబైన సర్వకార్య నిర్వాహణ భరంబు వానియందుం బూన్చి, తన తమ్ములతోడం బా నతని విడువక, కడువేడ్క నందడి

కానితనంబు మెఱయ నుండియు, నయ్యెడ నప్పాండవుల నెల్ల విధంబులం జెండాడలేక, కర్ణశకునులతోడను తమ్ముండగు దుశ్శాసనునితోడను మంతనంబు సేసి, వారికి వారణాసియందు నొక లాక్షామయం బగు నిలయంబు సేయించి, వారలం దల్లితోడన నక్కడ నుండుటకుం దండ్రిచేత నాజ్ఞాపితులం జేసె. అంత నప్పాండవులును దమపెదయప్ప యానతిం బూని, యమ్మతోడ నరిగి, యచ్చట నివసించిరి. అంత నాగాంధారేయుండు వారి కేమఱపాటుం దలంచి యొక్కరాతిరి వారు నిద్రించుచుండ, నయ్యిల్లుం గాల్పించుటకు జతనం బొనరించిన, నాజాడ బొడంగని నయధర్మధనుం డైన విదురుండు పాండవులయందు బరమప్రేముండు గావున, నెరికిం దెలియ రాకుండ, నొక్క-భీమసేనునకు మాత్రంబ గోచరం బై యుండం దన నమ్మికకు నిమ్మగు నొక సేవకునిచేత నీసుద్దిని కమ్మం గూర్చి యంపెను.

## పాండవులు లాక్షాగృహదహనంబునుండి తప్పించుకొనుట.

అంత నావృకోదరుండును విదురుండంపిన కమ్మ నెమ్మనంబునన సొమ్ము చాడ్పున మఱంగి సంకేతతమికిం దొలిప్రొద్దున నేతెంచిన యాదుర్యోధనానుజీవిం గని యెఱుంగనివానివలె వారిలగ్గు లడిగి మన్నించె. మఱియు నాయావసథాంతరాళంబున నుండి వెలువడుటకుం బోవుట కై, యొక యవటద్వారంబుం దనవారును నెఱుంగకుండ నిర్మించి, యారాతిరిం దొలుతం బోలి యాదఱు బాడి తద్దయు నిద్దురం జెంద, నఱిముఱిం బరికించి, యాయింటికి నాలుగుమూలల నగ్గి ముట్టించి, తనయున్న



దమ్ములుం దల్లియు నత్తమిల్లిన యమ్మంచంబు నెత్తికొని, నెత్తిం గొని, యాసురంగద్వారంబున వెలువడి, యయ్యెడ నొక యడవికిం జనె.

'అన్యథా చింతితం కార్యం దైవ మన్య ద్విచింతయే' త్తను నయంబున నక్కౌంతేయులకుం జెట్టం జేయ సమకట్టి యేతెంచినట్టి చెనంటి, దాన యీయింటినంటిన యంటరాని జేజేల్దంటమంటలం గలసె. అంత వేకువ కాంగ నవ్వనంబున నుండు నండజంబులు మెండుగం గూయం దొడంగుడు, మేల్కాని పెరగంది, యిట్లగుట కేద్ది కారణంబో యనునుం దత్తరంబుగ నుత్తలంబు నొందు కన్నదానికి నన్నాకసప్రభవుండు గుసగుసగాంగ జరిగిన దంతయు వింతల సంతతంబు గాంగం దెలిపె. యుధిష్ఠిరప్రముఖులుం బిమ్మట మేలుకొంట నంటి, యాదంట బంటుతినంబునకుం గాంధారేయు నొంటనికిం బిట్టు గట్టి తటుకుపాటు నంటి, నాతనినరువడిం గొండాడిరి.

## బ్రాహ్మణవేషంబులం బాండవు లేకచక్రపురంబున వసించుట.

అంతట నయ్యాదనుకుం దగిన చెయువుల నలిపి, వారందఱుంగలసి యుత్తరిమన మందఱము నేసుఱించి యుండుటయ కర్జం బని పరికించి, గోచిపాఱు మచ్చులం దాల్చి, తమ యవ్వతోడ నేకచక్రపురం బను పేరం బరంగు నొకనేల, జేజేల కువ్వంబు జేరి భిక్షరంపువృత్తి నునురులం బెంచుచుండిరి. అట్లుండ మున్ను బకుం డను నొక్క రక్కసుం డుక్కుమిగిలి, పెక్కు తెఱంగులం గక్కసంబుగ నాయూరంగల వాఱులకుం బారిం

జేసి, తనయిచ్చకు వచ్చినట్లు వారల మెక్కుచుండ, పక్కడివార లా బాధకి సైప నోపక, వానిం గని దండిగ వేడుకొని, "యోయీ! నీ వింటి కొక్కండుగాఁ బ్రొద్దు ప్రొద్దున తిండికై నీయందఱకుఁ బుచ్చెదము. కాన నూరకు వీడి, తాళు కొంట నంటి, మమ్ముఁగొంతయజ్జ నను వు మనిరి. అంత వాఁ డును వారినుడువుల కొడంబడ నాఁడన్ని గట్టులును దాము దిట్ట మ్మ్ము నేసి వట్టు గొట్టక యట్ల సలుపుచుండిరి.

## కుంతి భీముని బకున కాహారంబుగాఁ బంపినకథ.

ఇట్లుండ నొండొక్కనాఁడు దీమరులు కంటసంబులును గంటసంబులు నగు దేవిరింపులఁ దుందుడుకు లొంద, నాగొంతుల తలకట్టగు నాకొంతిదేవి వారలమనికితంబు లాలించి, యుగ్గేస్తురాలిఁ జేరి, ఓయవ్వా! మీ రెల్లి త్తి నతిమాత్రే గలుకువందురులఁ గుందుచున్నా రిది యేమని యడుగ, నాయి లురాణి యారాణికి ట్లను వచియించె. అక్కరో! ఈసుద్ది యేమని నుడువుదు? ఇక్కడ నొక్కరక్కసుండు వెక్కసం బగు నుక్కునఁ బెట్టల్లి, నెక్కడివారలకుఁ జక్కడఁ జిక్కక, నిక్కం బగు రూపు వీడిన జముఁడో యని యెంచఁదగి, బకుం డనువాఁడు గలండట, వానివలనఁ దమకుంగల్గిన గొడవయు, నంగులకు దా మొనరించుకొనిన యొడంబాటును నంతియుఁ దేటపడ నుడివి, మెల్లి, మాయింటివంతు వచ్చినది. మాయింట నున్నవారము నలువురము. మగఁడును గొమరుండు గోడలును వానితిండికై నేన యేగెద నేన యేగెద నని జతనం బొనరించుచున్నారు. నాడు నిమిటి మొంతేని సాధువు కొమ



రుం డొక్కఁడ కోడలైనఁ గ్రొత్తగ మగనితోడ వేడ్క లందుట కేతెంచినది. ఉసురులయేలికకు మ్రుక్కడిచావును సంతుకు తెంపును గోడలు హానికి బాళి గాకుండుటయు నాదిగాఁ గల లగ్గులకు మూలంబగుట, నేన వాని కాహారణపుసర కగుదునని తలఁచుచున్నదాననని యామె వలుక, నాకెంకితేఁ డిట్లనియె.

ఓ యవ్వా! యాలింపుము. నేను ముదుసలినై తిని. కావున బొలియుట నాకుఁ దాపుననున్నదయ! కట్టడికట్టిన లగ్గులెగ్గు లేక వెగ్గలంబుగఁ జవిఁ గొంటి. ఇంక నేను మని యానంగల సుమాళంబు లెవ్వి గలవు? మఱియు భర్తక్రియకుఁ గర్తయగుటఁ బురుషుండు భర్తృపదవాచ్యుఁ డయ్యె. దానికి విమయుం బగుటచే యోష భార్యాపదశక్యం బయ్యె. ఇట్టి నేను దీని యుగదకోర్చనఁ జేసినదోసంబు బొసంగ కున్నె? యని వినుచుచుండ వారలకొమరుండు జేరి, యాఁకెకిట్లని వాక్రుచ్చె— ఓ తల్లీ! నామనవు లాలకింపుము. ఇయ్యొడలు వీరలవలనఁ గలిగినదికాన, దీనికి వీరల దొరలు. నేను వీరలసొమ్మును. వీర లట్టి నాకు సాములు. సొమ్ముఁగూర్చుట నెట్టన గన్పట్టునట్టి కడగండ్లఁ గొట్టుటకై కదా! ఇంతియ కాదు. ఇట్టివారల చెట్ట నెట్టుటకు నే దిట్టనైతి నేని, నాకు నిహపరంబులుఁ గలవు. లేకున్న, నేమి కాఁగలవాఁడనో? యనుచు, నాతని పెండ్ల మక్కడి కేతెంచి, కేలు మోడ్చి, యాయవ్వకిట్లని వాక్రుచ్చె:- ఈలుపరు లగు నిల్లాండ్రకుఁ దండ్రియుఁ దల్లియు దయ్యంబును జెలువుఁడె కదా! అట్టియాతని విన్నాణంబు లగు మన్నలకు మూడుగు లగు నాయత్తమామ లెవ్వారలు కాఁగలరు? నేనిపు

డక్కుండఁ దిండికి దిండియరతం బయ్యెద నేని, నాముదుసళ్లకుఁ గడగండ్లు గావంబడవు. చీరె చిరిగినఁ బెఱచీరఁ జేర్చునట్లు, లాఁతిపొలతి సేకరించుటకు సందియం బింత యేనిఁ దక్కటింపం జూపట్టను. కాన న ట్లొడఁబాటు వాటింపఁ జేయు మని, పలు మాఱులు వేడ, డెందంబులోన వారివంతలఁ జెంతకు రాకుండ నంతంబు నొందించుట కై నముకట్టి యగ్గజంబు దనసడిపట్టికిఁ జేపట్టు నని యెన్ని, విన్నబోనియాననంబు గలదగుచు, నప్పాఁడు రాజమహిషి దిట్టతనంబు గన్పట్ట వారల కి ట్లనియె.

కుంతి భీము నసురకాహారంబుగఁ బంపుదు నని
వారికిఁ జెప్పుట.

ఓసాధువులారా! మీర లందఱుఁ బురువడి మేలు చేయువుల వారలు. వెండియు మాకుఁ బెక్కుప్రొద్దుల మెండుగ నండఁ జేసిన వారలు. వంగడంబునకు నొక్కమొలక నందినవారు. నే నన్నన్ నేవురు మైపుట్టువులు గలదానను; కాన నాకూనలలో నొకని వానికి నోగిరంబుగ నిచ్చెదంగాన మీరు గొందలంబునఁ గుందక, సంతసంబున నుండుఁ డని గొండాడి నుడివె. అంతట వా రందఱు నవుడుబుట్టినట్టులఁ దమ్మఁ దలంచి సంతసంబుతో నుల్లసిల్లి వానికి మెక్కుటకుం దగిన తక్కినపెక్కుతెఱఁగులఁ వంటకంబు లాయితంబులు సేయ సమకట్టి యుండిరి అంతి నక్కుంతి యప్పటియట్టు చేయఁదగు చెవుల నొవరించి, రేతిరి నత్తమిల్లి మెల్ల మెల్లన ముచ్చటఁ జూపట్టఁ దనతలంపు కొమరుల కెఱింగింప, వారలును దమసవిత్రి ప్రత్యుపకృతితత్పరతకుఁ దలకొని మైకొని హెచ్చుతనంబున



మెచ్చుంబడు నచ్చెరికఁ దొచ్చుంబు గాఁ నెమ్మనంబుల నమ్మ రొఱలయమ్మలిక సైఁపనోపమికి నెలమి నొందుచుండిరి.

భీము నసుర కాహారంబుగాఁ బంపనున్న తల్లితో
ధర్మజాదులు భాషించుట.

అట్టియెడ సకలసద్గుణగరిష్ఠుం డగు యుధిష్ఠిరుండు తల్లిం గని, యి ట్లని విన్నవించె— ఓయమ్మా! నీవు మహాకులీనవు వీరపత్నివిగాన నీలాగున నానతిచ్చుట వింత యై గన్పట్టదు. మమ్ముల నందఱ నీ వెట్లు మనఃపుటకుఁ జాలియుంటివో, యక్కరణి దయ్యంబుతోఁ బ్రాణంబు టయ్యోనేనిఁ దమ్ములఁ బ్రోవ వలసిన వాఁడను గాన, నీపనికి నాకు నానతి యిమ్మని నమ్రతంబుగా నుడువ, నయ్యెడ వడముఁడి దక్క దక్కిన కవ్వడి మొదలగువారలు, నొత్తు లగు జత్తులతో హత్తిన పలుకుల మెత్తంబడని చిత్తంబుల నన్నఁబోలి విన్నవించిరి. పిమ్మట నద్దేవి, మొగంబునఁ జిఱునగవు దళుకొత్త, శర్మదం బగు నర్మిలిచే ధర్మనందనుఁ గని యి ట్లని వచించె— ఓయీ! నీవు జ్యేష్ఠుండవు. విహ్వచ్ఛుండు కనిష్ఠతముండు. కవలు గడు పిన్నలు మఱియుఁ దల్లిఁ బాసినవారలు; కాన వడముడి నంపఁ గోరిన దాన నని నుడివి జననికి నాధర్మవర్మ మఱియు ని ట్లనియె.

ఓజననీ! వీని వెరవునఁ గదా మన మందఱ మింతతఱికి నుసుఱుల మోసంబు నొందక మనుచుంటిమి! మఱియు నియ్యెడ బెగడొందినవానిఁ బోలియున్న వాఁడు. కాన వీని విడువఁదగు తక్కిన మాలోన నెవ్వని నేని, నెయ్యంబున నేర్పఱుపు మనిన నక్కొమరునకుఁ గొమరుమిగుల, బలు మెఱుపుల వారి

యుల్లంబుల నుల్లసింపఁ జేయుచు ని ట్లనియె:- ఓహట్టీ! మిమ్ముఁ బట్టి నెట్టకేలకు సంగడలంగొట్టి పొట్టివిగా నట్టి సుకంబులకుఁ బట్టగును నని గట్టిగ నీయసురులఁ బొగొట్టికొనక దిట్టతనం బున నున్నదానను; గాని మీచెట్ట నెట్టనఁ జూపట్ట నెట్టుల నైన మనుటకు సమకట్టుదునే? మనవశమ్ముడి కడు దంట; గావున భండనంబున వానింజొడాడ గలండని కాదె యిత్తలంపు. ఇంమకుఁ దార్కాణం బల లక్కయుక్కనుండి పన్నుండి కురు కుందఁగిలిన మనమంచంబుఁ దలఁ బెట్టుకొని వచ్చుటయు, నత్తఱి బలుగాన నద్దము జేయఁ జండబలుం డగు నాహిడింబుం డను కండతిండిగాని దండధరునకు మెం డగుదండబలంబున నుండ గఁబంపుటయు, నీమొదలు గల లింగంబుల వీనియంగంబులు పృథుబలరంగంబు లస యంతరంగంబునం బొంగుదు సమకట్టి తి నని వారలకుఁ దెలియఁబలికె.

అయ్యెడ భీమసేనుఁ డంతయు నాలించి, తల్లీ! నీదీపన బలంబునకు వీఁ డవగ నెంతటివాఁడు? మనకడగండ్లకు మూలం బగు దుర్యోధనుండు సబాంధవుండుగా నిట్టివాఁడు కానలయు నని ధీరతఁ బలికె. మఱియు నయ్యింటివారు నేయువంటలజత నంబుఁ గాంచి యయ్యాహార శకటం బెవ్వఁడు తనకు వశంబగు నో యని ప్రతిక్షణంబు ప్రతీక్షించుచుండె ఇట్లుండ నీయింటి వారు దమకు బెశీవం బగు నబ్బెడన గడచె నని సంతోసంబున లెస్సఁగ నుండ దేని, యారేద్రిమ్మరీఁడు గనువడి నదరి వంట మింబట్టి వెండియుఁ జనుదెంచి, దమ్ముంగూడ మగుడఁగుడుచు నో యనెను కడుబెగడున నేమచేక వీఁడి, హావణికత్తోడఁ గూడి, దండిగ వాడించుచుండిరి. అంతట నిశాచరవధోదయ



తృప్తియత్నుం డగు భీమసేనుండు దమ్ముఁ బొలియించునో కో యనుతల్లడమ్మునఁ బోలెఁ దమిస్రంబులు విస్రంసత నొందె. అశేషవపుర్మధ్యప్రదయాభల్లుండగు నాబకమల్లుఁడీనాఁడు మడయు నని యూర్ధ్వలోకాంతర్వర్తులకుఁ దెలుపుకరణి నక్షత్రంబు లెల్లఁ బొడమె. భీమసేనవిదళితబకకళేబరగళితక్షతజరసపూరంబున నమ్మేదిని యిట్లు గాఁగల దని బోధించువానివగిది, ననూరుం డుదయించె. నేఁడాదిగ నేడాదిగా వీనిమాంసంబు మనకుఁ బర్యాప్తం బైన యాహారంబు గాఁగల దని యొండొరులకుఁ జెప్పుటకుంబోలె, పక్షిప్రకాండంబులు కలకలారావంబులు సేయుచు, నాసలకు ముసలె. భండనకాండ ప్రచండ దండధర జానుజదోర్దండ తేజంబునకు నాత్మీయమయూఖమండ లౌజం బునకుఁ దారతమ్యం బుపలక్షించుటకుఁ బోలెఁ జండభానుం డుదితుం డయ్యె.

భీమసేనుండు ఆహారశకటంబుతో

బకుఁ డున్నయెడకుఁ బోవుట.

అయ్యెడ నచ్చటివార లందఱును విహిత సముచిత తాత్కాలిక కృత్యంబులు నిర్వర్తించుచుండిరి. అంతఁ బూర్వ ప్రహారం బతీతదేశ్యంబు గాఁగ, నగ్రహామేధి సమున్మద మహిమసంవాహ్యం బగు నొకమహాశకటంబు రావించి, పౌరుషమాత్రం బగు బోనంపుతిట్టయును, దిట్ట లగు తట్టలఁ బట్టించిన పెక్కురూపు లగుకూరలు, నట్టివయగు పిండివంటలు, నొరెంపుకుప్పయును బలుగొండకుఁ జెఱికొండ యగుచు నొక్కు చున్న పప్పుముద్దయును, పలుకానల నిండింపఁబడిన నేయి

పచ్చపుల్ల గడ్డకలువ మొదలగు నెల్లసరకులును, దానియందు నిలిపి, యక్కపటపటువుఁ గని—యోనారాయణా! నీ వస్మదభిజనావనపరాయణుండ వగుటఁ జేసి, పరానందం బనుభవింపు మనిన, నప్పాణిభంజని యాగృహమేధిం గని, హాసన్ముఖుం డగుచు "సత్య మస్తు భవద్వచ" యని యభినందించి, యాతనిచేత "నిచ్చటికిం గవ్యూతిమాత్రవ్యవధానంబుగ యమునా తటంబున నొక శిలోచ్ఛయంబు బకుని కాశ్రయంబుగల దచ్చటికి నిత్తెఱఁగున నేఁగు" మని నుడువంబడి, యట్ల కా నిష్మని యిమ్ముగ వెడలె.

పదంపడి, యప్పార్షదశ్వి యయ్యయనంబునఁ బోయిన వానియయనంబు మిగుల నమేధ్యంబుగఁ గానంబడు నది లెస్స గాదని తలంచి, మించిన హెచ్చరికతోఁ బెలబెలవునం జని, యమున నొక విమలం బగు తలంబున నాకంచరంబు నిలిపి డిగి, యప్రవాహంబున కేఁగి, వార్చి పూతిసమాంతంబునఁ గూర్చుండి, యాయనస్సంస్థాపితపదార్థజాతం బంతయు నొక్క క్రిక్కిరియ మక్కువతో మెక్కి, హాయి నొందె, పునరాచమనం బొనరించి మించి, సంచితకౌతూహలుఁ డగుచు, "వానిచెంతకు మనకుఁ బోవలసినదేమి? వాఁడ యిక్కడకు వచ్చువాఁ" డని తలఁచి, తనరాక వాని కెఱింగించుట కై సంవర్తసమయసముద్బుద్ధక్రోధప్రతిబద్ధ భైరవాట్టహాస నిర్ఘోషంబో, కాకున్న జగదరిష్టదష్టంబున నశ్వరమేష్ఠిచే నుపదిష్టంబు లై త్రివిష్టంబువలన నేతెంచునట్టి పుష్కలవలాహక ప్రముఖ మహాభ్ర గర్భసముద్గీర్ణ భీషణభిదిరఘటాఘోషణంబో, కానినాఁడు కల్పతయక్షణమయప్రతీకసంధుక్షితక్షణ సకల



భువన క్షారీకరణ దీక్షారూక్ష నిటాలాక్ష సంక్షుపణయనధ్వజ ఢక్కానిర్హ్రాదంబో, యిదిమొదలుగల తక్కటింపులఁ దదుప కంఠసంవసథు లగు శరీరసంఘులు విదీర్ణకర్ణు లై, సముద్ఘాత స్తంభ భావు లగుచు నాకర్ణింప, కుంభస్మదగంభీరవేదిద్వరదనిధ్వానంబు విని సముద్యత్క్రోధ రూక్షం బగు హార్యక్షంబు భంగి, నింగికిఁ బొంగ నొక్క మహాక్ష్వేళానిర్ఘోషం బొనరించె.

అంతకమున్న యహ్వాంగులు సాదరి మొసవుతఱి దప్పాటకు సారెసారెకు వేసారుచు, నాహా! యిమ్మానుసులు బెడఁగుసెడి గడుదుడుకు లగుచుఁ దొలి గట్టిడిన మెక్కుసరకు లంపుటకు నొడ లేమఱి, మసలి నాకుఁ జిడిముడిపాటుఁ బొడమించుచుండిరి; కావున నిప్పట్టున నత్తట్టునకుఁ బోయి, నాదిట్టతనంబు బెట్టిదంబుగఁ జూపట్టఁ బట్టుపట్టి, యొక్కపెట్టన వాండ్రనందఱఁ బట్టికొని, మట్టగించి నాకట్టలుక వెట్టంగొట్టెద ననుచు, నుంకించుచు నద్దిష్టంబున సుస్నిగ్ధఘృష్టకుంభశ్శోద ముష్టిప్రహారంబున మొందుగ న్మందు నాశుశుక్షణ్యక్షీణ జ్వాలామండలాడంబరవిడంబనంబునఁ దన దగు నుద్యత్క్రోధోషర్బుధం బనిరుద్ధభైరవత దుష్ప్రధర్షంబు గాఁగ, నప్ర్పాభంజనిప్రభావనంధుక్షితక్ష్వేళానిర్హ్రాద ఘోరార్భటిచేతఁ బ్రధనసముద్యదకుంఠోత్కంఠ ప్రతిభట కంఠీరవనిస్సృష్ట పటుతర కటుగర్జానిర్భిన్నశ్రవణపుట ప్రతిబుద్ధ దుర్ధర్షామర్షరూక్ష హార్యక్ష సదృక్షుం డగుచు, నిర్ఘోషఘ్నుంబు బహిర్నిస్సరణోద్ఘాత సముద్యోగం బగు నామంబునకు సరణిదిదిత్సువో లె తదీయాంతర్గతం బయిన నల రజంబగతియుఁ దొలుత నిర్గమించి వసించెనో యని తక్కటింప, సొంపొంది ప్రత్యగ్రసము

ద్యదహస్కృన్మండల హిండమానఘృణి మండలానుకరణ పటు తరదాక్షిణ్య దుష్ప్రేక్ష్యప్రతిక్షిప్తప్రేక్షా సంధుక్షితదిధక్షావక్ష లక్షణంబు లగు నీక్షణంబులఁ బరిస్ఫురద్విస్ఫులింగ పటలంబులఁ బ్రస్ఫుటంబుగ నుట్టంకణంబు సేయుచు, స్వావసథకుధర గర్భంబున నిర్గమించి, యంతటం బరికించె.

అత్తఱి మఱియు, నోరీకృపణ! కుణపగణ భోజిబంధూ! ఎచ్చట నుంటివి? దుర్దమాదభ్రదర్పస్ఫురణ సంవర్గణ వంధ్య ప్రసర నిరీక్షణత సరణిగానఁ బ్రోడవు గాకుంటివా? లేకపోయినేని, గుంటెతినంబు వాటించినయడుగులఁ జిగురుపాటు నంటియుంటివా? యని, జీరుసామీరువీరాహ్వానంబు సెవిసోఁక నూర్ధ్వదేశ విభ్రష్ట నిర్భిన్నఘూర్ణఘట జఠర లుఠత్స్నేహ స్రుతి పరిష్వంగంబున రంగజ్జ్వాలుం డగు దహనుకరణి, జాజ్వల్యమానుఁ డగునుఁ గడువడిం బుడమిఁ దన వెడిదంపుటడుగుల నికుటల గడగడవడక నడరించుచు, నచ్చోటు న్వడలి క్రోధాంధుండగుటఁ బాటఁగానకుండియు, నాతని చీఱిక చిన్నెఁబట్టి యచ్చక్కటింబట్టె.

### భీముఁడు బకునిఁ బరిమార్చి వచ్చుట.

అంత నక్కౌంతేయమధ్యముండును దూరంబున వాని సంరంభం బుపలక్షించి, కురులంజుట్టి గట్టిగ బిగఁగట్టి, దిట్టంబగు శాటపట్టంబునం గౌనుమానుగ బంధించి, నియుద్ధసంరంభంబు సంధించి, భుజాస్ఫోటనం బొనరించుచుఁ గట్టాయితం బైయుండె. పిదప నప్పలాశమల్లుండును మూర్తంబైన రౌద్రరసంబుఁ బోలియున్న యాగాంధవాహిఁ గని, యనూనాభిమానం



బున నతనిఁ గదిసె. అంత నయ్యిరువురు నురు వగు బాగరున గండోపలంబుల విశంకటవిటపిప్రకాండంబులఁ గొంతతడి గొట్టికొని, కలసి విచిత్రభంగుల మిగులఁ బోరాడిరి. తర్వాత నాభీమసేనుండు నతనిని హార్యక్షం బున్మత్తవేదండంబుం బోలెఁ బొలియించి, యా యసురయనుసురులకు నాసురభావంబుఁ బాపి, యా సురభావంబు నొందించి, నిజతులక్ష్మీ సమాశ్లిష్టుండగుచు దనమనికి పట్టునకుఁ జని, మాతృగ్రజాగ్రజన్ములకు నుచిత భంగుల వందనసత్కారంబు లాచరించి, బకనిబర్హణవార్తా సుధానుభవసమాశ్వస్తచిత్తుం డగువారిచేత మిగుల గౌరవంబుల నొంది, సుఖంబున నుండె.

### పాండవులు లాక్షాగృహదాహంబున దగ్ధు లగుటకై కౌరవులు దుఃఖించుట.

అంత దుర్యోధనుండును పాండవులఁ జెంకితోడఁ గాల్పుటకు దూతఁ బంచినపిమ్మటఁ, గొన్నినాళులకు నక్కడియను జీవు లంపినకమ్ముల నమ్మతోఁగూడ నప్పాండవుల దండధరభవనాతిథు లగువారలంగాఁ దెలిసికొని, మెచ్చుగు హెచ్చరికఁ బుట్టినరిచ్చపాటు వంతఁ బొడమినదానింగా, నట్టిదైవ కన్నీటి నిట్టిదిగాఁ బగామరిక సేయనే తెంచువారలకుఁ గానుపించుచు, నుల్లంబున నిస్సపత్న సామ్రాజ్యం బబ్బె నని సంతసిల్లుచుండె. సాత్త్వసోదరుం డైన సుయోధనుండు దక్క, దక్కినవార లందఱును వారివంతలకుఁ గడుఁ బొగలుచునుండిరి. ధీమద్వరేణ్యుం డగు విదురుం డొకఁడు దనయుపాయంబున వారికపాయంబు గలుగరా దని యెంచియు, నప్రవృత్యక్షతఁ గలుగుసందియంబు

ద్యదహనస్ఫురన్మండల హిండమానఘృణి మండలానుకరణ పటు తరదాక్షిణ్య దుష్ప్రేక్షప్రతిక్షిప్తప్రేక్షా సంధుక్షితదిధక్షావక్ష లక్షణంబు లగు నీక్షణంబులఁ బరిస్ఫురద్విస్ఫులింగ పటలంబులఁ బ్రస్ఫుటంబుగ నుట్టంకణంబు సేయుచు, స్వావసథకుధర గర్భంబున నిర్గమించి, యంతటం బరికించె.

అత్తఱి మఱియు, నోరీకృపణ! కుణపగణ భోజబంధూ! ఎచ్చట నుంటివి? దుర్దమాదభ్రదర్పస్ఫురణ సంవర్గణ వంధ్య ప్రసర నిరీక్షణత పరణిగానఁ బ్రోడవు గాకుంటివా? లేకపోయి నేని, గుంటెతినంబు వాటించినయడుగులఁ జిగురుపాటు నంటి యుంటివా? యని, జీరుసామీరువీరాహ్వానంబు సెవిసోఁక నూర్ధ్వదేశ విభ్రష్ట నిర్భిన్నఘూర్తఘుట జఠర లుఠత్స్నేహ ప్రసృతి పరిష్వంగంబున రంగజ్జ్వాలుం డగు దహనుకరణి, జాజ్వల్యమానుఁ డగుచుఁ గడువడిం బుడమిఁ దన బెడిదంపుటడుగుల నికటల గడగడవడక నడరించుచు, నచ్చోటు న్వెడలి క్రోధాంధుఁడగుటఁ బాటఁగానకుండియు, నాతని చీఱిక చిన్నెఁబట్టి యచ్చక్కటింబట్టె.

### భీముఁడు బకునిఁ బరిమార్చి వచ్చుట.

అంత నక్కౌంతేయమధ్యముండును దూరంబున వాని సంరంభం బుపలక్షించి, కురులంజుట్టి గట్టిగ బిగఁగట్టి, దిట్టంబగు కాటపట్టంబునం గొనుమానుగ బంధించి, నియుద్ధసంరంభంబు సంధించి, భుజాస్ఫోటనం బొనరించుచుఁ గట్టాయితం బై యుండె. పిదప నప్పలాశమల్లుండును మూర్తంబైన రౌద్రరసంబుఁ బోలియున్న యాగాంధవాహిఁ గని, యసూనాభిమానం



బున నతనిఁ గదిసె. అంత నయ్యిరువురు నురు వగు బొగరున గండోపలంబుల విశంకటవిటపిప్రకాండంబులఁ గొంతతఱి గొట్టికొని, కలసి విచిత్రభంగుల మిగులఁ బోరాడిరి. తర్వాత నాభీమసేనుండు నతనిని హార్యక్షం బున్మత్తవేదండంబుంబోలెఁ బొలియించి, యా యసుర యుసురులకు నాసురభావంబుఁ బాపి, యా సురభావంబు నొందించి, జయలక్ష్మీ సమాశ్లిష్టుండగుచు దనమనికిపట్టునకుఁ జని, మాతృగ్రజాగ్రజన్ములకు నుచిత భంగుల వందనసత్కారంబు లాచరించి, బకనిబర్హణవార్తా సుధానుభవసమ్మోదస్వచ్ఛేతస్కు లగువారిచేత మిగుల గౌరవంబుల నొంది, సుఖంబున నుండె.

### పాండవులు లాక్షాగృహదాహంబున దగ్ధు లగుటకై కౌరవులు దుఃఖించుట.

అంత దుర్యోధనుండును పాండవులఁ జెంకితోడఁ గాల్చుటకు దూతఁ బంచినపిమ్మటఁ, గొన్నినాళులకు నక్కడియను జీవు లంపినకమ్మల నమ్మతోఁగూడ నప్పాండవుల దండధరభవనాతిథు లగువారలంగాఁ దెలిసికొని, మెచ్చుగు హెచ్చరికఁ బుట్టినరిచ్చపాటు వంతఁ బొడమినదానింగా, నట్టిదైవ కన్నిటి నిట్టిదిగాఁ బగామరిక సేయనేతెంచువారలకుఁ గానుపించుచు, నుల్లంబున నిస్సపత్న సామ్రాజ్యం బబ్బె నని సంతసిల్లుచుండె. సాత్త్వసోదరుం డైన సుయోధనుండు దక్క, దక్కినవార లందఱును వారివంతలకుఁ గడుఁ బొగలుచునుండిరి. ధీమద్వరేణ్యుం డగు విదురుం డొకఁడు దనయుపాయంబున వారికపాయంబు గలుగరా దని యెంచియు, నప్రత్యక్షతఁ గలుగునందియుంబు

నాత్రేయిన హిడింబుండు జెండాడఁబడిన సుద్ది నానోఁడువం గని వేడ్కజెంది, “వానిఁ గూల్ప నేర్పరి కరువలిపట్టియెగాని వేరొకొండుఁ గానేరఁడు. వాఁడు మాతృసోదరులం దోడ్కొని పోవ, నాయస్రపుఁ దజస్రంబు రాఁబోలు దానఁ గడసె” నని యుత్తిచే సాధించికొని, యానందించెను.

పిమ్మట నొండొక్కబండికాలిప్రోలఁ గడు దండి మగండగు బకదివిషద్విద్వేషణుండు మడసె నను జనశ్రుతి విశ్రుతంబు గాఁగ నెరవరులు పాండవు లనపాయు లగుచు నెచ్చోటనో మెయిమొఱంగి యున్నా రని దలంప, నక్కురుకుమారుని యానందప్రభవంబు లైన స్తంభబాష్పంబులు మహాజనసమక్షంబున శుగ్నావతఁ జిరకాలభావనావశంబునఁ బోలిన ట్లయ్యె.

## ద్రుపదుఁడుచేసిన ద్రోణపరాభవము కథ.

ఇట్లుండ ద్రుపదుం డను గండుమన్నీఁడు పాంచాల దేశాధీశుండు, చిన్నతనంబున నక్కుంభసంభవుతోడ ధనురుపనిషదంబుఁ గఱచి కృతకృత్యుండై, మన్నరికంబు నొంద నేగు వేళ, సహాధ్యాయియు సకలకళానిధియు నగుట నాతనికిఁ దన యుల్లంబుఁ దెల్లంబు గావించి, ‘నీవు నాతోడఁ జనుదెమ్ము. ఇమ్ము లగు సొమ్ముల మానించెద' నని వయస్యతాధర్మంబున వేఁడిన, నాధన్యుం ‘డిప్పుడు నాకు నీయుండకు రాఁ గర్జంబు కానంబడదు; గానం దఱి సేరినపుడు నే నేతెంచెద నిచ్చలిమి మఱువకు'మని దీవింప, సంతసిల్లి, తనపురంబున కేఁగి, ప్రాజ్యంబగుసామ్రాజ్యం బనుభవించుచుండె. అంతటఁ గొంతతఱి జరుగ నాయస్త్రవిద్యాగురుండు దనతనయుఁడగు నశ్వత్థామకు శైశ



వంబునఁ దనపతి యగు కృపికిఁ బాలిడ్లఁ బా లొడమకునికిఁ జింతించి, శిశురక్షాకృతోత్కలితుఁ డగుచుఁ జదువునఁ జెలికాఁ డగు ద్రుపదునిఁ గంటి నేని, నాతం డొక్కండైన యావు నీని నివ్వండొకో యని, నాద్రుపదపురంబున కేఁగి, హజారమ్మున నిలచి, యాతనియనుజీవి నొకనిఁగని గవిశరంబుపుట్టఁ దొల్లింటి సుద్ది యడియాలంబుగా నుడివి చెప్పఁబంపిన, వాఁడట్లు సేయ నారాజకుంజరుండు రాజ్యలక్ష్మీ పరిస్రుదనుభవ వివశత్తుఁ డగుటచే మయిమఱచి ‘వాఁ డెవ్వండో యే మెఱుంగము పొమ్మని నుడువు' మని సాహంకారంబుగాఁ బలుకఁ దిరిగి వాఁ డట్ల విన్నవించె.

## ద్రోణుండు క్రుద్ధుం డై వెడలిపోవుట.

అంత స్తంభిత క్రోధవికారుఁ డగుచుఁ దన నెమ్మొగంబునఁ జిన్నినగవు చె న్నలర, నాబంటుఁగని ‘యోయీ ! యట్లకానిమ్ము. ననుఁ గారవించి యింకొక్క నాయుదితంబు తేని కెఱఁగింపుము. ‘చదువుంగఱచుతఱి నెయ్యంబు మఱచి సాఁకెద ననుబాసయుఁ దలఁపక, ఇదానీంతనయతిథిత్వంబునఁ బరికింపక, కలిమికావరంబున మైయేమఱి యున్న నిన్ను సన్నంబుగాక యొన్నందగు నాదండలబలిమిని సకలసంబంధిసహితంబుగ నాసన్నవినాశసన్నాహుఁగాఁ జేయనోపుదు ; కాని బాల్యంబునఁ గన్నచెలిమిచే సువ్యాధ్వధ మహాఘునిదానం బని యూరకుంటిని. పాపచింత న ట్లుండ నిమ్ము. వీని నీవుడు మడయించినను భూయిష్ఠమదకృవీట విశంకట కటాహ కరట తట వంఘట్టన విఘటిత సంబంధిబంధుర వసుంధరా ధరతట

తాపరిస్ఫుట నిజసత్త్వవేదండరాజకుంభస్థలీనిలీనవిపులముక్తాఫల సముత్పాటన పటుతరనఖర శిఖావిశృంఖల ఖేలమాన కడారాత్తుంబునకు నతమంబులును, పమస్వేవణోపలబ్ధంబులగు నభినవతృణకణచర్వణనిపుణతాధన్యంమన్యవన్యమృగసంహారణంబు గదా నా కిన్నిచుఁ బొలియించుట! కాన నేఁగఱపినచదువతిచే వీనింగట్టించి నాయండకుఁ దెప్పించుకొన్నయప్పుడు, వీఁడు నన్నెఱుంగు. ఇపుడు మదీయనివాసంబున కేఁగాద; కాన నానుడువులు గాఁగ, నీ విపుడ పుడమిజేనికిఁ దడయక వెగడువీడి నుడువుము. ఇట్లు చెప్పితి వేని, బ్రాహ్మణ్యగణ్యుఁడ నగు నావచనంబున నీకు లగ్గగు. ఒండేని నీకుఁ గడు నిడుమలు వాటిల్లు నని యొక్కణసేసి యయ్యాత్రగురుండు నిజనికేతంబునకుఁ జనెను.

### ద్రోణుఁ డర్జునునిచే ద్రుపదు బంధింపఁజేసి పగఁ దీర్చికొనుట.

పిమ్మట నన్నృపుండును దనయనుజీవివలన నద్ద్రోణుని సందేశంబును వినియును నాదరింపక యుండె. పిమ్మట నక్కుంభసంభవుండు కురుకుమారులకు ధనురుపనిషదంబు సాంగంబుగ నుపదేశించి, పదంపడి వారు కృతార్థులగుచు గురుదక్షిణం గోరుఁడనిన, 'నేను పాఱుఁడనగుట నెట్టిసొమ్ముల చేతఁ బ్రయోజనంబు లేదు. మీరు చతురులైతి రేని, ద్రుపదుండనువానిఁ గొట్టి గట్టిగఁగట్టి నాయడుగులచెంతఁ బెట్టుఁడనుఁడు, నార్జునుం డట్లచేసి గురునాథు లబ్ధమనోరథునిఁ జేసె. అప్పు డమ్మన్నీఁడు మన్ననసెడి విన్నఁబోయి, హెచ్చిన



పుచ్చడీకకు నచ్చువడి యాగురుని సమయించుటకుఁ దగినకొమరుని, నాసొంత్రామణికి రాణికాఁదగు కూఁతుఁ బడయుటకై కడుజతనంబునఁ దగిన యాజకులతోఁ డఁగూడి, యొక జన్నంబు సేసెను.

### ద్రౌపదీధృష్టద్యుమ్నులజననము.

అంత నాజన్నంబునందు విధివర్ధిత సంప్రీత సముజ్జ్వల జ్వాలనకుండలాంతరాళంబునఁ బటుతరనిస్త్రింశతనుత్రాణబాణ సంపూర్ణతూణబాణాసన ప్రముఖాఖిల మహాయోధనసాధనుండును, ఘటితపుటవిశుద్ధస్నిగ్ధహాటకసదృశతనురుచిచ్ఛటుండును, నష్టాపదసవర్ణుండగుటఁ బరసింహసంహననతం బోలి సింహసంహననత మించువాఁడును, సకలశుభలక్షణాకరుండును, నగు నొకకుమారుండు జ్వలనప్రభవతం దనకుఁగల కుమారసత్త్వం బెల్లవారికిఁ దెల్లంబు సేయుచు నుదయించె. పదంపడి త్రయిం బోలి సంస్కృతాత్మకత్వంబున విలసిల్లుచు, వారకపావకం బగు పావకహేతివ్రాతగర్భంబునఁ బొడముటఁ దనకు ననదృశశుచిమయత్వంబును వెలయించుచు, రూపసౌందర్య గాంభీర్యాది గుణగణంబులు నసర్వాశ్రయణంబునఁ బొడమిన కచ్చరతను బుచ్చఁగోరి, యియ్యాశ్రయాశనందుఁ బ్రవేశించి, విధంబులగుచు నేత్రద్రూపంబునఁ బరిణమించెనో యనుతలంపుఁ బుట్టింపఁజాలు నొకబాలయు నావిర్భవిల్లె. అపుడ యాతను భూత మద్భుతంబుగఁ బేరోలగంబు నందలి వార లందఱు నాలకింప, నగ్గింభకునకు ధృష్టద్యుమ్నుఁ డనియును, నక్కన్యకుఁ గృష్ణ యనియు నభిధానంబు లొనరించె. అంతటఁ

పాంచాలుఁడు కృతకృత్యుఁ డగుచు, నాసభ్యుల నిభ్యశార్వాంబుగాఁ బూజించి, తత్ఫలద్వయం బెప్పుడు నేకురునో యని ప్రతిక్షణంబు, బ్రతీక్షించుచుండె. పదంపడి కొంతతడవునకుఁ బాంచాలికేయపంశాంకురమణు లగు నక్కౌంతేయులు జాతువ విషయంబున సువర్భృధునిచే సంప్లోషితులగుటను కర్ణాకర్ణిక నాలించి, యభిమత జామాత్రలాభంబునఁ బొరిపొరి బొగులుచుండె. అంతట నొలి హిడింబుండు మడియుటయును, బకుండు బొలియుటయును విదితంబు గాఁగ, సుదితశేముషీవిశేషుఁ డగుచుఁ 'బాండవులు మనియుండుట నిక్కంబు భీముండు గాక యొరుం డెవ్వం డారక్కసుల నుక్కడగింపఁ జాలువాఁడు? ఈకృష్ణ దైవతవరంబునఁ బ్రభవించినది. కాన, నద్వితీయవిక్రముం డగు ధనంజయునక ద్వితీయ కావలయు. మఱియుఁ బరిణయోచితకాలంబునకుఁ బరిణతయయ్యె' నని యాధృష్టద్యుమ్నునితోడ ముచ్చటించె.

అంత నతండును బరికించి, మనము దుష్కరంబైన నొక పణం బేర్పరచి, స్వయంవరంబు గుహారు సేయింపఁదగు. వారలు మహామహులు గాన, నింతకులోన మెయిమాయిక నొందువారయ్యును, సమయం బగుట గూఢవర్తనంబు వీడి యుల్లసిల్లగలవారు. కాన నట్లొనరింపఁ దగు నని వచించిన, నన్నరదేవుండు మిగుల లెస్స యుపదేశించితి వని కొడుకుఁ గొండాడి, యట్ల సేయించుటకు జతనం బొనరించె.



## పాండవులకు బ్రాహ్మణులు ద్రౌపదీస్వయంవరం బెఱింగించుట.

పదంపడి నానాదేశవాసు లగు ధరణీశులు నాద్రుపదుని ప్రయత్నం బాలించి, యచ్చటకుఁ బోవుచుండఁ బొడగని, బాడబు లనేకులు మార్గవశంబున నేకచక్రపురంబు సేరి, యచ్చటి రసారసాహారులు దొలుతఁ దెలియబడువారు గాన, దైవయోగంబునఁ బాండవు లున్న యావసథరథ్యం జేరి, కొంత తఱి విశ్రమించి, యచ్చటివారలతో ముచ్చట లింపార నిట్లనిరి. ఎల్లి ద్రుపదుండు గూఁతుకు స్వయంవరమహోత్సవంబు సేయ సమకట్టె. మఱియు నవనింగల జగతీపతు లందఱు దిగంతవిశ్రాంతం బగు నామోదమయగుణంబున నాకృష్టమతు లగుచు, నప్పద్మినిని నేకరింపఁగోరి యేఁగుచుండిరి. అయిన నీ వెడలువారి కెల్ల నావామలోచనాలలామంబు చేఁ జిక్కునే? అభీష్టదక్షిణదానసంతర్పితగురుండును శుచివంశజాతుండును విశదసమాఖ్యాకలితుండును వాసుదేవవాత్సల్యపాత్రుండునగు నొకమహీంద్రకుమారున కబ్బుఁగాక! అని యట్లుండనిమ్ము.

## స్వయంవరమునందలి సంతర్పణను వర్ణించుట.

అన్నరదేవుం డిష్టువహంబు మహామహితు నొనరించు జతనంబున నుండెఁగాన, నచ్చటికిఁ జేరినవాఱులకు బారుగాఁగ జవికెలు నుక్కెరలును వడలు నావడలు నతిరసంబులు దోసిల్లు లడ్డువులుఁ బెక్కువిధంబు లగుపోళికలు కజ్జకాయలు మొదలగు బిండివంటలు, సుగంధబంధురం బై శర్కరామయం బైన

జారును జారుపరమాన్నంబును యథేష్టపుట నిక్షిప్తహయ్యంగ వీనఘృతపూరంబును, మఱియుఁ గందయును బెండలమ్మును మోహాళమ్మును మొదలుగాఁగల దుంపవస్తువులును, కారవల్లీ పనస రంభా వార్తాకకూశ్మాండప్రముఖంబు లగు శలాటువస్తువులును, నిరువది ముప్పదింటికిఁ గొఱఁత గాకుండ శాకంబులు గాఁగ, బహువిధరసంబు లగు లేహ్యంబులుఁ బదిపండ్రెంటికి నూనంబులు గా కుండ, స్నేహాభరితంబు లగు సర్షపరసాలంబులును, జంబీరంబులు నాదిగల యేడెనిమిదింటికిఁ దక్కువగాని యూఱుఁగాయలును, నధివాసిత బగు దధియును, మధురామ్లమయంబు లగు కలుపుచిమురుపలును, బహువిధవస్తుపక్వం బగు దప్పళంబును, సక్తుపిండసదృశం బగు నాంగారకసూపంబులును లోనుగాఁగల యమితపదార్థంబులతోడ నధికవిమర్శంబున యథేష్టంబుగా భోజనంబు లిడు. మఱియుఁ దొలుతన మృగమదఘనసారప్రముఖ సురభిద్రవ్యభవ్యతమసుస్నిగ్ధఘృష్ట కపిత్థమాత్రమలయజఘుటికలు నిచ్చు. మెక్కెడుతఱి నానుటకుఁ జెక్కుతావుల సరకుల బిక్కటిల్లి, శర్కరామిళితంబు లగు పానకంబే గాక, వేఱె పానీయంబు బొం డుండదు.

పిమ్మట నేలాలవంగ జాజీఫల కర్పూరభావిత క్రముకశకల శుష్కనారికేళఖండప్రముఖపరికర పరిష్కృతకేతకచ్ఛద నచ్ఛాయ హరివల్లీదళ పంచవింశకంబును నొక్కొక్కని కిచ్చును. ఇద్ది క్రొత్త గాదు. ఎల్లెడల నుత్సవవిధులందు వారింటి వరుసయు. మఱియు నధికాగంబు గన్పట్ట నాభూసురుల కక్షయంబు లగు దక్షిణల నిచ్చును. ఇప్పుడైనఁ జెప్పం బనియేమి? కాఁబట్టి యెవ్వరైన నీరసాహార నిషేవణంబున నిస్సారం బగు



రసనకు జీవాతువుఁ గాంచు కోరికఁ బట్టగుదురో, వారచ్చటికి నేతెంచెదరు.

## ద్రౌపదీస్వయంవరమునకుఁ బాండవులు పోవుట.

అని యావిప్రులు ప్రకృతార్థబోధనాసక్తిచేత సంభాషింప, నయ్యెడఁ బార్థుండు వారిపలుకు లాలించి, పలాలమధ్యగతంబు లైన దృఢబీజంబుల వెరవరి సేకరించువడువునఁ దదీయ వచనాంతర్గతం బైన వ్యాహారవిశేషంబు దివ్యాహారవిశేషంబు బోలి జానుగులఁగ్రోలి, యిదియ మనకు మంగళనిదానం బని యెంచి, మాతృసోదరులకు నాయుదంతంబు శ్రుతిసంగతంబు సేసి, వారలతోడ నబ్బాడబుల వెంటనంటి నడచె నిట్లచ్చనుపచౌకమున నఱుగుచు నడితేయి, వేలుపులవాఁకఁ దనప్రేముడి మడఁతులతోడంగూడి నీరంబుల నాడు నంగారపర్ణుం డను నొకానొక జేజేలపుట్టువులదొరఁ గనుంగొని, కినుకంబూని తనుఁ గసిమసఁగింప నమకట్టు తెఱఁగు నరికట్టిన, గట్టిగ నద్దిట్ట బెట్టిదం బగు తనబెట్టితనంబు మట్టుపడకుండ నచ్చొట్టం గదిసి, యోడించిన, వెండియు నాతండును మెండుగఁ బ్రీతుండగుచుఁ దనకడు పడి దండిగఁ గొండాడి, శస్త్రం బగు నేత్రంబుఁ గోరి పెచ్చుగ నిచ్చియుడిన, నావివ్వచ్చుండుఁ దాని గొడంబడి, వానిచే నన్నంబులు గాని మన్ననలం బొంది, పోయి వచ్చెద నని వాక్రుచ్చి, కిమ్మఱ బాటసారులఁ దగిలి, యుగ్రాణపదపదంబు నొంది, యచ్చటి కేతెంచిన నానా రాజన్య కుమారసమ్మాన్యతత్తల్లక్ష్మీలక్షణంబులు గనుంగొనుచు, దమయమ్మను నొక్కకూసల నేతరిమనికిపట్టున నుంచి, స్వయంవరమహాస్థానంబునకుఁ జని,

సోదరులతోడ నప్పటిచోట్ల వీడక, యప్పుడమివేల్పులనడుమ గూర్చుండె.

## ద్రౌపదీస్వయంవరవర్ణనము

అంత ధృష్టద్యుమ్నుండు పూర్తిగ మూర్తిబూనిన సౌందర్యరమయో, కాదేని శంబరపరిపంథి యొక్క పెట్టున నచ్చటం జేరిన మన్నెకాండ్ర దిరంబు లగు బీరంబులు నీరంబులం గలుపం బంపంగ నీయంగనయై యేతెంచిన యాతని మహామహిమం బోలుచు సమ్మోహనాస్త్రశక్తియో యనుచు, నెన్నం దగి, చెన్నుమీఱి, సన్న పునుఁగు వడవడ వడంక, నాత్మీయాంగ సంగత మంగళ మణిమయానల్పాకల్ప ప్రభాపటలంబుల సకల సామంత సంతాన స్వాంతంబుల నశ్రాంతంబు విశ్రాంతికి నతి దూరంబుగాఁ దామసనరో నిమగ్నంబులఁ జేయుచు, సప్రతీక యగు చిత్రదేవతయుంబోలి విలసిల్లుచుఁ దత్త్ద్రాజలోకచేతస్సమాకర్షణనిపుణసుమబాణ మహాపాశ శంకాకారి యగునిక్కచాంపేయకదామంబుఁ గేలంబూని తోడరాఁగ నేతెంచి యక్కడనక్కడ నుండెడు మండలేశమండలంబుఁ గడు వేడుకం గని యంతకుందొల్లి పుణ్యాహపావక పరిచర్యాచరణాది విధిపూర్వకంబుగా నభ్యర్చితంబై యేతత్స్వయంవరమహోనిరీక్షణ మహోత్కంఠతఁ దనరాణులతోడం గూడి యేతెంచిన తక్షకవాతభక్షకుండో, యిద్ది ఘనాగమంబై మోదంబున నొప్పుటఁ గడుబెడిదంబు లగు పిడుగుల నండఁగొని మెండుగ నిండిన రూపంబుతోడఁ జనుదెంచిన వేయుంచులవాలు యేలికవిల్లో యని, తక్కటింపంజాలి నెక్కసంబగు కక్కసంబున



జూపట్టి, సకలరిపుజన వంచన సందిత మహిమ ప్రపంచకంచుకిత కాంచనమయపుంఖ మయూఖ రేఖారింఖార్భటీ ఘటితంబు లగుచు ధనంజయుత్వ ప్రకాశిత్త బాంధవంబుననో, కాకున్నఁ దన్ను మున్ను తెన్నుదన్ని నన్నంబు గాక, విన్నాణంబున మెండుగ నిండిన పాండువునామసామ్యంబునఁ దనతండ్రికిం బగఱయగుటఁ బఱిమార్పఁ గలం డనియో, యక్కవ్వడికి లగ్గుసేయంబూని ప్రదరికరంబు లగు నప్పదరంబులఁ జెఱ లంటకుండ నాయఁటరాని వెలుగులదంట దట్టంబగు తన పెట్టను దిట్టపఱచె నో కాక, కాకున్న వైహాయసం బగునా వైసారణ లక్ష్యం బాస్వాదింపఁ దనరసనల నన్నారసంబుల మొఱగించె నో కాక యని తర్కింపఁజాలి, కర్కశంబు లగు కాండప్రకాండ పంచకంబునఁ బ్రచండతనొప్పు నక్కాండాసనదండంబును యవనిక నవనికిం దిగిచి వారలకుఁ జూపి, యీ రాజమండలంబులో దండిమగం డగు నెవ్వండైన నీసింగాణి పిడికిటికట్టు చేఁ బట్టి, పెఱకేలఁ గొప్పునని గొనయంబుఁ గూర్చి యీ లకోరుల నరువగు వెరవున మొయిత్వెరవునఁ గట్టిన చేపరూపున మెలంగుచున్నదియుఁ గడు దవ్వగుటఁ గన్పట్టకుండినదియు, నీడ చేతన పరికింపఁ దగినట్టిదియును, నవ్యత భవ్యం బగు నీశరవ్యంబు నేలఁ గూలనేసి, వాసిఁ బేసియగుచు నిక్కన్యకామతల్లికను వీరతల్లజుం డగుచు వరియింపఁదగు ననియె.

అంత నయ్యనంతాకాంతు లంతరంగంబు సంతతంబు గాఁగ, నన్నడుపు లాలించి మించిన ముఖకాంతులతో నాకర్ణ లావణ్యలక్షణంబులు వీక్షించి, కడునాస నాశర శరాసనంబులకడ కేఁగి కనుంగొనఁ దోరంబు లగు బీరంబులు దూరంబులై

పాంచజన వారందఱు నతిఘోరక్రూర కుంభీనసగుప్తంబగు మహానిధింబోలి, యాకన్నియయందు నెట్టకేని మిగులం దోలంగినయిచ్ఛల మ్రుచ్చులంబోలి మోములు వంచి, సంచితమందాక్షంబుల మందాక్షప్రసారు లగుచుండిరి.

అంతఁ జైద్యమద్రేశ మగధనాథ ప్రభాకరాత్మజులు నోలింపని, యాప్రచండకోదండదండంబుఁగని తదీయల స్త్రక విన్యస్తప్రశస్తహస్తు లగుచు, దానిఁ గొని, యటని న్గొనయం బంటింపబూని, పలుదడవుల నెన్నితంటలంబడియు, దమ దంటతనంబునకు బంటరులు గాక యుండిరి. అద్దిష్టంబున ద్రుపద ధృష్టద్యుమ్నులు నష్టపీక్ష్యప్రాయం బగు నక్కార్యపిపయస్య ప్రచయం బుపలక్షించి, యప్పార్థుఁ డిందుఁ గాఁగం బడఁ జేమయ్యో నొక్కో! యనుచు, సొక్కుచు నుక్కసెడి యుండిరి.

### అర్జునుండు మత్స్యయంత్రంబు దిగిచి ద్రౌపదింగొనుట.

అయ్యెడ ధనంజయుండు, పండితు లగువారు బెఱల చేవలఁగానక తమయుదుటల వెలిబెట్టరు కాన, నాయొడ్డోలగంబునందలి దొడ్డదొరలమగటిమి యడ్డులేక యుండునో, లేక గొడ్డువడునో కాంచి, పిదపన యుద్దండవారి కుద్దండవర్తనంబున బండువు గాఁగ మెండగు నాగండుం బండ నిచ్చెద ననియుండి, పండినజెండంబుగలవాఁ డగుచు, నబ్భాడబమండలాంతరంబు నుండి వేదండరాజంబు నొషవున వెడలి, శుండాప్రకాండంబుఁ దరుప్రకాండంబు పట్టి వంచుకగిది దోర్దండంబున నక్కాండాసనంబుఁ బూని తనసీటు దీటుదాటుమిటారమ్మైన దాని సజ్యంబుఁ గావించి, మెచ్చుగునెచ్చరిక నొకసాయకంబు సంధించి, తదీయచ్ఛాయాసమంచితలోచనుండగుచు వ్రేయ, నదియుఁ దెగి సమీరణంబునఁ జటజట విరుగుచు నప్పేరోలగంబున నున్న మన్నదొరమిన్నలమన్ననలకుఁ దగిన శౌర్యాభిమానంబులతోడ నేలంగూలె.



అయ్యెడ నవక్రం బగు నతని విక్రమప్రక్రమంబునకు నజస్రంబు బ్రహృష్ట యగుచు, సాక్షాత్కరించిన విజయలక్ష్మియో యని, విచక్షణు లుపలక్షింప, నాద్రుపదవీచిపడలక్ష్మి యగు నాకృష్ణ కృష్ణునికంధరంబున సంశ్రితస్థైర్యగుణ యగు సౌదామనింబోలు నాగనకదామంబుఁ గీలించి వరియించె. అయ్యవసరంబునఁ దీర్పరు లగు నరవరులు దైవయోగం బిట్లున్నది కాఁబోలు ! ఇవ్విటుం డెట్టి మహాత్ముండో ! కాకున్న సకల పార్థివప్రకరంబునకు నూనరాని యిక్కార్యంబు నెరవేర్చునే ? అజునిచే సృజ్యమానంబు లగు నెల్లపదార్థంబులయందుఁ బరమేశ్వర ప్రసాదపాత్రతావైషమ్యంబునం జేసి మహిమతారతమ్యంబు గనుపట్టు గాన నేన పండితుండ, నేన శూరుండ, నేన సంపద్వంతుండ, అను నిదియాదిగాఁగల యభిమానంబు లొక్కనికిం జగ వనుచుఁ దమవివేకధారల నిజపరాభవభవవ్యథాసంజ్వరంబులఁ బొలియించి, ప్రశాంతస్వాంతు లగుచు దమదమ పీఠములకుఁ జనిరి.

### కర్ణాదులు తలపడ నర్జునుండు వారి నోడించుట.

వివేకదూరు లగు మఱికొందఱు, కర్ణ శకుని సుయోధన దుశ్శాసన ప్రముఖు లఖర్వగర్వపరిచర్వితభావి పరిభావాశంకు లగుచుఁ జేతంగానివానికిఁ జేతిరికిఁ జెట్టఁదలఁచుటయు సాజంబు గాదె, నిట్టియలఁతిగానినాటికిం బట్టగుచుండుటునకు నివ్వఁడు గిక్కున్నియ మానికంబుఁ గొని పోవఁ జూచుట బిరుదే? కాన, వీనిఁ బట్టి దట్టించి యీపండెంపు నెపంబున మనల నలఁగఁ జేసిన యీమన్నవానికి నాన విన్నాణంబుగఁ బన్నాగంబు గాఁగ జెడిదం బగు బీరంబున నిప్పెండిలిరూఁతు మనదండలవండ నోడఁగూర్పవలయు ననీ, బండతనంబున నిండిన డెందంబులతోడఁ బల్లలము లగు పరిగముల గుములఁ గూర్చుకొని, యాల మబ్బులు గబ్బితనంబున నుబ్బి గుబ్బలి నిబ్బరంబు లగు జడులం బొదువుకరణిఁ జెంపను లగు సంపరులగుంపుల గమకించుచు. జుట్టుముట్టిన, నద్దిట్టయు నిట్టట్టు నట్టువట్టక, జెట్టితనంబున దిట్ట యగుచు, నాపుడిగొట్టు జేజేలు జెట్టియల యాగడపలంబోలి హుటాహుటిం బట్టువట్టి నందనం బెండి విడిన యుల ప్రోద్దుమానికాయలనుండెడి దూది పింజలఁబోలియు జెల్లచెదరు గాఁగఁ దననుదుటున నొక్కపెట్టఁ జిఁకగొట్టె. అంతటవారు, 'చెఱపకురా చెడిపోయెద' వను నునువుకుఁ దార్కాణంబు లగుచు, ప్రీలిన యేలికలక్కనంబు గలవా రగుచు, జమునిపేఁడుఁ జూడక మిగిలియుండు లంకెల. గలసి, దలలకు వలువలు హత్తించి, దమనాఁటికిం జనిరి. అంత నయ్యావల కీలజాలంపు చూలి యగు నచ్చేవట్టు



పట్టియుఁ దద్దయు ముద్ద యగుచుఁ జూపట్టి నయ్యర్జునఁ బెద్ద యుంబ్రోద్దుఁ బెద్ద దగు నొక విద్దెంపు గద్దెయఁ గూర్చుండి, యుక్కుచ్చితులు పొచ్చెంపుతనంబున మచ్చరంబునకు మచ్చు లగుచు, నెచ్చినయెచ్చరిక విచ్చలవిడి మ్రుచ్చులకు మచ్చులగుచుఁ దను మ్రుచ్చిలింపఁ దొచ్చెంబు గానిక్రచ్చన విచ్చలు గాఁగ నొక్కపెట్టనఁబెట్టికొన సమకట్టి జెట్టులం బెట్టిదంబగు తనదిట్టతనంబున నిట్టట్టు దొలఁగక కట్టలుకఁ జేపట్టి, తనదండల లావ్రన నమ్ములు నిమ్ములు గా గ్రుమ్ముచుండ, వేటకాఁడు మిటారంబునం గొంకులం గొట్టఁ బొంకంబు లగు బింకఁబులు సెడి కొంకులకుఁ జెంకు లయిన సంకులత నల డొంకలం జేరు జింకలగతి, మఱియు మృగయుండు గాల్చిన, నళికనాళోదర వికీర్యమాణస్ఫులింగమయ గుళికావళీసమాఘాతసంహతా వశిష్టసీసోద్భవమండలంబు చాడ్పున, వారల నెల్లఁ జెల్లచెదరుగాఁ బాఱంబరపు నవ్వీరవరుని గని సంతసిల్లుచుండె.

అంతట నద్దంట గొంటు లగునక్కంటరుల వెన్నంటి పెంటలవాలు సెసి వెంటన రా నక్రక్కల్గంటి క్రీఁగంటి చూపుల నతనియొడలంటి రొంటమరులు సేయఁ గాయంపు మంటల మాటలఁ గలిపె. పిమ్మట నావేగంటిపట్టి, యక్కలువకంటి, నీడవోలె వెంటనంటి రా, నైదోడులతోడఁగూడి యొప్పటివసతికిం జని, జననింగాంచి; తోడెంబు గాని బత్తితోడ నాయమయడుగులకడఁ దలనిడి, యవ్వా! యివ్వాసరంబున నొకఫలంబు సేకూరె వన నద్దేవి, యాతనియింగితంబుఁ బరికింపక, ఓయబ్బీ! యాఫలం బీ రేవురు నను భవింపుఁడని నుడువుచు, నాకృష్ణయుఁ జేరి యామెచరణసరోజంబులకుఁ దనవదనార

విందంబు పొం దొనరించి, యొక నిముసంబు సంతసంబు సేయ, నబ్బాలిక నెత్తి గ్రుచ్చి కౌఁగలించి, యోయమ్మా! వీరపత్నివి గమ్మని దీవించె. పిమ్మట వారందఱుఁ బాద్యర్ఘ్యలగు దమకుఁదగిన సల్లాపాదివర్తనంబు లొనరించి శయనించిరి.

## అర్జునుఁడు ద్రౌపదిఁ గొని యింటికి వచ్చుట.

అంతకుమున్న ద్రుపదుండు నిజసౌభాగ్యవిజిత ప్రద్యుమ్నుఁడగు నాధృష్టద్యుమ్నుఁడును గలిసి, యాకృష్ణ యర్జునునకు రాణిగా దేవతావరంబునఁ బుట్టె. ఇప్పుడాతండు నిక్కంబుగాఁ దెలియంబడఁడు. కాని వీఁడ తా వలయును. కాకున్నఁ బెక్కుదండులతో నిండిన యక్కర్ణ దుర్యోధన దుశ్శాసనాదుల నెవ్వండు గెలువఁజాలు? మఱియు మానుషముల్లఖిల్లజవేషంబుఁ బూని, యొక్కకతంబున నజీవితం బగుచు, రౌద్రరసమయాత్మత నేతెంచునట్టి యామణిపూటశిఖరంబునుంబోలి, భద్రమూర్తి యగు నామద్రనాథు నిర్నిద్రత మాత్రోకని, విద్రవింపఁ జేయఁజాలునట్టి దిట్ట యక్కరువలిపట్టికంటెఁ బెఱవాఁ డొకరుండు గలండె? కాన వీరలు సమయవశంబున నపహ్నుతప్రకృతు లగు పాండవులు గాఁబలయు నని తర్కించి, సంతసించి, యారేయి పోయి గాఁగూరిమిఁ గూరుకుఁజెంది వేఁకువ గాఁగ, నుపవతంబు గాంచి యుచితక్రియల నెలయించిరి.

## ధృష్టద్యుమ్నుఁడు ప్రచ్ఛన్నులగు పాండవులఁ గన్పెట్టుట.

అంతట నాధృష్టద్యుమ్నుండు వారివసతి తెలిసినవాఁడు గాన, తనతండ్రి యనుమతంబున వారినిక్కంబుఁ బరికింప



దలంచి, తీవంచసంతుల వారికిఁ దగినయరదంబులు గైసేయింపఁజేసి, మన్నరికంబులకుఁ దగినట్గులక్షణంబులు విక్కటిల్ల నప్పటికిం దగిన వివిధజనంబులు దమకుందమకు నుచితంబు లగు రీతుల సేవింప, నక్కులాల కులంబునకుఁ జనియె. అంతట నాయిలుతేఁడు వెరవరిగావున, నానుద్ది యాలించి, యామస్నీఁడు దనవాడఁ గూర్చుండుటకుఁ దగునటుల, యాత్మీయ నిలయశాలల నెల్ల నుచితపరికర ప్రకరంబులఁ బెల్లుగ నందంబులై చూపట్ట నలంకరించి, తా నెఱుంగనివానిఁబోలి, యప్పాండవుల, నయ్యా! మీర లిచటఁ గూర్చుండుఁడని జరిగినరాతిరి జరిగించిన రాజపుత్రప్రవేశగారవంబుకంటె మిగుల గారవంబు గనుపట్ట నేఁడెను. పిమ్మట వారలును దమ కుచితప్రకారంబులఁ గూర్చుండి, వినయసంభృత చేతస్కుండై యాగేస్తుతగు బోటునఁ దమయెంత నుండ, వానితోడఁ దగుమాట లాడుచుండిరి.

అంత నాధృష్టద్యుమ్నుండు నానావిధ మహావిభవ చిహ్నంబులు మెఱయఁ జేరువునకు రాఁగ, నాకుమ్మరి వారి యాన వడసి, యెదు రేఁగి, యారాపట్టికి దట్టంబగు వినయంబున నెఱఁగి, చేతులు జోడించి, యోమహారాజనందనా! నీలంకెవుట్టువు నక్కటికంబునఁ బట్టి నామనికిపట్టుపదంబుల నంటి, గారవంబునకుఁబట్టు సేయు వే యని యర్థింప, నారాజన్య శేఖరుండును ప్రమోదించి, వాని నిశాంతాంతరంబున కుచితపరిజనసహితుండై, తెరువుఁదెలుపుచు వాఁడు ముంగల నడువ, వార లున్నచలువసాల కేఁగి, వారలుఁ దానును దదవసరోచిత సత్కారంబులు సలిపి, వారలతోడ నిట్లనియె ఇప్పుంచాల

విషయగోప్త యగునావత్త మీచే స్వయంవరలబ్ధ యగు మా చెలియలికి విధివైభవంబుల ననర్గళంబులుగా వెలుగొందఁ బరిణయంబు సేయఁదలఁచి యున్నవాఁడు; గావున మన మందఱ మచ్చటికిఁ జనఁదగు నని వారల నొడంబఱచి, వార లందఱ తోడఁగూడి యచ్చటనుండి వెడలి, తోరణమున కఱిగి వారిం గని యయ్యరదంబులలో నెయ్యవి నెయ్యంబులఁ జేయు, నయ్యవి యారోహింపుఁ డనియె.

### పాండవులు క్షత్త్రియోచితరథంబులపై ద్రుపదునింటి కేగుట.

అయ్యెడ నప్పాండుకులప్రదీపు లొండొరులఁ జూచి, జల్లునవ్వున నతనిజుత్తి నగ్గించుచు, వేర్వేరు లగు తేరులఁ జేరితి మేని, మనకు నిచ్చలు వచ్చినట్లు ముచ్చటలాడుట హెచ్చియుండదు. కాన నీయరదంబునందె మన మందఱము నందంబుగఁ గూర్చుండుద మని నుడివి, తోడఁజనుదేరు నానవిత్ర వధువులకు దేవీసమర్హంబును విచిత్రక్రమం బగు నొకచక్రచరణంబు సూపి, వారివారి నక్కడఁ గూర్చుండ నియమించిరి. అత్తఱి నప్పార్థుండు దన కేల నాధృష్టద్యుమ్నునిచేఁ బూని సల్లాపంబు సలుపున ట్లుండఁ దొలుత ధర్మనందనుండు రథారోహణంబు సేయఁ, బిమ్మటఁ బ్రాభంజనియు నట్లు కాఁగఁ, గవలు దనవెంట నంటి రాఁగఁ దాను నామూర్తిమంతం బగు మనోరథంబునుబోలు నమ్మహారథంబునఁ గూర్చుండె. అప్పు డాధృష్టద్యుమ్నుండు, వారి యుత్సాహవైదుష్య ప్రతీక సంస్థాన వంచక సమాతృత్వాది నిమిత్తంబుల వారలఁ గుంతీయుతు లగు కౌంతేయు లని నిశ్చయంబుగ నెఱింగె.



పిమ్మట నగరుహజారంబున కేఁగఁ నాద్రుపదుండును, దనయువదనవిలాసంపు విశేషంబులఁ బాండవు లని నిశ్చయంబునఁ దలఁచి, యొచ్చిన యొచ్చరికతోడ వారినిఁ గారవించి యక్కుంతీదేవిని గారవంబు గాఁగ మన్నించి, జరిగిన యంగదపాటులకు జానకీదమయంత్యాది సాధ్వీచరిత్ర నిదర్శనవర్ణనంబున నోదార్చి, కూఁతుతోడ నంతిపురంబున కనిచె. అయ్యాజ్ఞసేని విజయునకు మాత్రంబు జాయ గాఁదగినదియగుటకు, నాకౌంతేయులు మాతృవాక్యపరిపాలనతత్పరు లగుటకు, నెట్లొనరింప వలయునో? యని పాండవులతోడఁ జింతిల్లుచుండ, నప్పాంచాల వల్లభునకడకు సకల నిగమ తత్త్వనిర్ధారణ సమర్థుండగు నాకృష్ణద్వైపాయనమునిచంద్రుం డేఁగుదెంచి, "ఇక్కన్నియ వీర లేవురకుఁ బత్నిగా వలయుటకై యీరాయమ యుదితం బట్లయ్యె" అని తన యోగదృష్టిఁ బరికించి, దానికిఁ దగిన కారణంబులు సాక్షాత్కరించి వారలకుం దెలిపి, యేవురకుఁ గ్రమంబునం బరిణయంబుఁ జేయింపుమని యానతిచ్చిన, నాద్రుపదుండును నమ్మహానుభావువచనంబున నాత్మీయాదార్యోత్సాహ వైభవానుసరణంబుగ విధిపూర్వకంబుగాఁ గరగ్రహమహంబు సలిపిన, సకల జనసంశ్లాఘ్య మానమహిముం డగుచుఁ గృతకృత్యత నొంది, యానందఘనరసాశయంబునం దోలలాడుచుండె. అంతటఁ గతిపయంబు లగు నహంబులకుఁ గురుధరణీశప్రణిధులు ద్రుపదపురంబు వెలువడి, కడువేగంబున సాజంబు లైనవేసంబులఁగొని, యాప్తజన పరివృతుఁ డగు నమ్మహారాజుఁగని తగు తెఱంగులఁ బ్రణమిల్లి యిట్లని విన్నవించిరి.

### చారులు దుర్యోధనునకుఁ బాండవులయునికిఁ దెలుపుట.

ఓ మహారాజా! దేవరయానతి మానేర్చుకొలఁది యా ద్రుపదునగరంబునందలి యుద్ధు లేమరుపాటు నొందక యాలించుచుంటిమి. అవ్వి యన్నియు వేర్వేర నిపుడు నుడువ నేల? ఇప్పుడొక వింత పుట్టె. అది నిక్కువంబని యూహించి దోఁచుట నేలికకు విన్నవింప వచ్చితిమి. అది జానుఁగులకుఁ గడు బెడిదంబుగఁ గన్పట్టినను, వీఁడిట్లు పలికె నని కినుక చేయక యాలింపఁ గోరెదను. దూతలు తమ చారపుకలిమి కనుకూలంబుగ నౌరుల మదిఁ దెరవు లెఱింగి, యొకిమీఁది కెలుఁగ జేయుట మాత్రన ముగిసిన కజ్జంబులు కలిగియుందురు గాని, వేరొక్కటిఁ జేయ లావరులు గారు. కావునఁ బిమ్మటఁ జేయఁదగినకర్జంబు దేవరకె యాయితంబు. ఇపుడు గంధవహానందనుండు జనకగంధంబునం బోలి, కడుగంధవహుఁడగుచుఁ గ్రమంబునఁ బిత్ర్యసఖాశ్రితుం జెంది, యాజ్ఞసేనీప్రేరణంబు ననుజత్రికంబును ద్రుపద శిఖండి ధృష్టద్యుమ్నత్రయంబునుఁ గలని చక్కఁపగడయును, రసనమయంబు లగు హేతులుగా లోగడ జరిగిన వంతలు వింతలగు పొగలై ముగియ, మిగుల రగిలి, మహార్భటీఘటనా ప్రచండ ప్రతిభటవనాటసత్వ ఘటాభక్షితం బగు నిన్నగరం బను నరణ్యంబున శరణ్యంబుగా రూపణంపఁ గణంగియు, నయ్యెడకు ధర్మతనయుం ననంగీకారప్రతిమారుతప్రతిహతమహోత్సాహారింహాస్పహాత హేతివ్రాతుండై, యున్నవాఁడని యొకసుద్ది పుట్టియున్నది. అగ్రజ శాసనం బనుకూలపాతరీతి నొందె నేని, నట్లగుటకు సందియంబు లేదు.



స్వయంవర సమయంబున మార్కొన్న పెంపెక్కు లగుబలు ద్రోవ్వరుల బీరంబులు వారంబులఁగలప మిటారింపునన యా శతపత్రజాతుఁ డొక్కఁడ చాలియుండెఁగదా! ఇపుడు వీరం డఱుఁ గలసి మార్కొన్న, నైన నెవ్వ రోపుదు రని నిక్కువంబున నక్కడివారలు దలంచుచుండిరి. ఇటమీఁద దేవర చిత్తం బని విన్నవించి, యాకొమెశయుని చేతఁ బెఱకర్జంబుల నియమింపంబడి చనిరి.

### ధృతరాష్ట్రాదుల మంతనము భీష్మాదుల హితోపదేశము.

అప్పుడా బికేశుః డాప్తగురు ప్రముఖ ప్రధానులైన ద్రోణభీష్మ విదురుల నుద్దేశించి, వింటిరే! ఇష్టార్థచరుల మనుకులు! ఇవి నిక్కువంబులుగా నుండునో, లాటిపొప్పు లగునో? యని యడుగ, నతనికి నాశాంతనవుఁ డిట్లనియె. ఓయీ! యిచ్చరుల వచనంబులఁ బట్టిగదా యిపుడు పాండవులఁ దలంచెదవు? ఇప్పుడైన వారిమనుట నిక్కువం బని నమ్మెదవు గదా! హిడింబుండు మడయుట విన్నదిమొదలు గాఁగ, వారలు ధర్మరక్షితులై జీవించియుందురని మతిమంతులు పరికించి నుడివిన, వానిని బెడచెవిఁ బెట్టితివి! గాని కొడుకులవేసకపు బన్నంబు వాటిల్లునో యని లెక్కింపవైతివి కదా మఱియు, బకుంపు సమయుటనాటఁగోలె వారలు సేమంబున నున్నవా రనియు, మనమందఱము దింబుగ నెఱుంగునది. అయ్యును నెల్లనాడునుఁ గొడుకుల యేలవలయు ననుతలంపు పలంతు లగువారిము సుద్ది తలంపు జేరనిచ్చినఁ దనకలతి గాఁగల దని తలఁచియుఁ బొలిచెవిఁ జేరనీయ దమ్మ్యె. ఇప్రణిధిఖామణం

బులు నీకు గ్రొత్త లగునేమో ? కాని మే మంతయు మున్న విని యుంటిమి. చరచక్షుష్కుండ వగు నీ కిట్లు కాకపోయిన, మఱి యొక విధంబున నీకును విదితంబులై యుండును.

నిన్న మే మీ ముప్పురము తెఱవరుల వలన నాలించి యుంటిమి. ఈ దూతలు లోఁగడన వినియు నిట్టిబెడిదంపు నుడువు లాడియుని కిట్లు దెలిపెద మనియు, దానియత్యంత సత్యంబు పరికించి వినిపించెద మనియు నింతవట్టు మసలిరి. స్వయంవర సమయంబున నాలక్ష్యంబుఁ గొట్ట నెట్టిదిట్టలకు వలవిగాకపోవుట నెల్లవారికిఁ దెల్లంబు చేసికదా యాతండు నీటుపాటున నాశరవ్యంబు భవ్యంబుగాఁ దునిమె. కాన నర్యో నివాసంబుల వారు నేయుంబున మించి, కాలంబున నడఁగి యుండి రని యందఱకుఁ బ్రవ్యక్తంబయ్యె, దొల్లి పాంచాలుఁ డద్వితీయుం డగునర్జునునకు ద్వితీయ గాఁదగు కన్నియంగోరి, జన్నంబు సేయ నాయగ్ని వలనఁ జేతనాత్మకంబును స్త్రీప్రకృతియు భక్తియుక్తులై సేవించువారికి నతిశీతల స్పర్శయు, పాలసులకు నెంతదవ్వున నున్నను దాహకంబు నగు నొక యభినవజ్వాల కలిగెను.

అట్టి యాజ్ఞసేని యర్జునునకే సాధ్య యగుఁగాని, పెఱవారికి నగునె? యని తెలవరులు దలంపవలయుఁ గదా! మఱియు నాయంత్రంబుఁ ద్రుంచిన వెనుకనైనను, వానిజాతి నామంబులఁ దెలియక, యెవ్వండేని గానిమ్ము. ధర్మక్రమంబునఁ బణనిర్వాహణం బొనరించి, దైవానుకూల్యంబున దానిం బడసె నని శాంతి నొందక, యప్రయోజకున కభిమానంబ యడియాలం బను చొప్పున నాతనితోఁ బోరి గెలిచి, యాక



న్నియఁ జేకొనుదు మనుదురాశచేత మూర్ఖునికదా నాప్తనివహం బగుచు నీనందనుం డిక్పటికిని నెండనిగాయంబుఁ గూడినకాయంబుతో నున్నవాఁడు. మంచిది కానిమ్ము. ఆమఱుదినంబునఁ బాండవులు ప్రకాశితాకారు లగుటను, వేదవ్యాసాది మహాముని శాసనంబునఁ దమకు నైకాత్మ్యం బెల్లభంగులఁ గల దని తెలుపువారిఁ బోలి, నక్కన్నియ కాలు ద్రొక్కుటను పంతముఁ జెంది రని యప్పుడ సకలలోక విదితం బయ్యెను, నీవు వారికిఁ బితృకల్పుండ వయ్యెను, వారి కున్న నీయందలి భక్తియుక్తుల నెఱింగియు, సక్రమంబుగాఁ బోరం బోయి, జర్ఝరిత ప్రతీకు లగు నీకొమరుల గరువం బుడుగుటయు, నీనడుమ వారల కందినవంతలఁ బరికించి ముందు సేయఁదగిన పని యేమని యెన్నండయిన మాతో నుడువవుకదా! కర్జంబు దరిదప్పఁగొట్టి పిమ్మటఁ జింతించువాఁడు మూఢుండ.

ఇద్ది నేన వచియించుట గాదు. తొల్లి నయవిదులచే నెఱింగిన తెఱఁ గిది. వడకుతఱిగని, దుష్పటంబున కప్పసంబుగ గొనుటకు, పగటికడజామున నోరెంబుఁ దెచ్చుకొనుటకు, వేకువఁ బొలతులఁ గలయుజవ్వనంబు జారిన వెనుకం జేపట్టి జేసుకొనుటకు, వారంబు పాఱినపిదపఁ గట్టఁగట్టుటకు, ముదుసలితనంబున జేజేల తీండ్రంబులఁ గొలువ సొమ్ము వమ్మిస్త్ర పోవుడుం బుడుకున నెగడుటకు జతనంబు సేయువాఁడును నడచుచు మెక్కువాఁడును, దా నుడువంగల పలుకునందలి విన్నాణంబు వెలయించుటకై యికిలించుచు వాక్రుచ్చువాఁడును, జరిగిన కర్జంబునకు నుమ్మలికఁ జెందువాఁడును, నొరులు వెలయించినమేలు నేమఱినవాఁడును, నిద్దరు గుసగుసఁ జేయఁ

బొంచి వినియెడివాఁడును, గడుమూఢు లని నీతిశాస్త్రంబుల రూఢంబయ్యె.

ఈయుదంతం బింతకుమున్న విన్నవారము. అయినను 'నాపృష్టః కస్యచి ద్బ్రూయాత్' అను నయా వలంబించి, కొంతతడి యూరకుండియుఁ బదంపడి, తత్తజ్జరిగినవెనుకఁ జెప్పినయుపాయం బుపాయనిరసనకుశలంబు గా దని తలంచి, నిన్న నీయుపురముఁ గలసి, యీప్రొద్దు నీతోఁ జెప్ప జతనంబు సేసినవారము. ఇపుడు రెండును సమకూడె. 'న హీంగితజ్ఞో౽వసరే౽వసీదతి' యను పండితవచనంబున నీ వడుగకున్నను, మఱియుఁ జెప్పఁదగిన యంశంబులు గలవు. వాని నన్నింటిని సకలకార్యాకార్యోపాయవిదుఁ డగు విదురుండు సెప్పెను. అతనిమిముకుల మాయుపదేశంబుగా నాలింపు మని వచింప, సత్రగురుండును నట్ల పలికి, యా విదురునిఁ బ్రేరణంబు సేసె.

## విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్తవ్యముపదేశించుట

అంతట విదురుండు నామహీశునిఁ గని, యోరాజా! నీకొడుకు వారలకుఁ జిన్ననాటినుండి యొనరించిన యెగ్గులు ని వెఱుఁగవే? అవ్వి వారలకుఁ గట్టడిబాసలు గావున, నాగడి వోవమోఁగాని యొరులకయిన గాటంబుగా నొడలునకు నెడబాపుటకు నోర్కొట్టియు కడముగాక, ముక్కలు దీరియుండదా? అవ్వి యన్నియు నీ వెఱింగినవియ గదా! ఉవ్వెత్తుగ నివ్వటిల్లుజతనమ్మునఁ గొడుకు రావించి, వారలకు 'నిట్టగుట నిట్టిబారు లేల సలిపెద' వని యెడ్డెతనంబు ద్రుంగ బెగడు



నొడఁగూర్పు సుడువులఁ జెప్పి యొప్పిదంబులఁ గఱపవుగదా! ఇక్కాలంబున వారల నటుండనిమ్ము. పెఱవారికైన నేమి దోఁచు? నీకొడుకు సేయు నట్టుచెవులకు సాక్షి వగుచు, నూరకొనియుండుటం గదా వాఁడు వెండియు నిట్టివాఁ డయ్యె. కాన నీతిప్పు వానిదిగాఁ దెలియందగు. నిక్కువంబుగ నీ వియ్యకొనుటన నిట్టు జరిగె ననుటకు సందియంబు లేదు కాన వారలకుఁ దోఁచుతోయం బొండగునే? నీకను మొఱగు బ్రమ్మరులనుడువులు నిక్కువంబుల గాని వేఱులు గావు. కాన నింకనైన నీవు వెరపుగలిగి, ముద్దుముద్దుగ సుద్దులు త్రెంచి, తగువారల నంపి, వారల రావించి, వారియయ్యనాఁడు మఱల నొసంగితి వేని గొంతతడి వేడ్క నుండెదవు. కానినాఁడు బెబ్బులిం బోలి, యుబ్బి నిబ్బరంబుగ నబ్బరంబుఁ జేయుచు, పోటాడ వచ్చెడి యవ్వడమునకి నీవార లెల్ల నిఱ్ఱు లగుటకు సందియంబు గానంబడ దని విదురుండు సెప్పె.

అంతఁ గొంతతడవు చింతించి యాతండు మాఱుసేయ నోపక, యక్కడి తీర్పరుల యొడబడిక నిట్లుచేసి వారల రావించి, సామునాఁడు వారల కొసంగి, యింద్రప్రస్థం బనుపురవరంబున నుండు మనిన, నాయుధిష్ఠిరప్రముఖులు సంతసిల్లి సకల జనంబుల నుల్లంబున నెల్లెడల నెలవులు కల్లవింపఁ దమకుఁ గాండప్రభవ కుండంబున నావిర్భవించి, కృష్ణ యనుగోత్రంబునఁ బరగి, పవిత్రశీలంబున నాసాత్రామణి సతీమణింగా గణియింపఁ దగిన యద్రుపద ధరణీరమణపుత్రికయ యగ్రమహిషి గాఁగ, నైకాత్మ్యంబునఁ దమరాజ్యంబు పాలించుచుండిరి.

## ఖాండవదహనవృత్తాంతము.

అంత నొక్కనాడు బిడౌజఃప్రభవుండు నిబిడోత్కంఠ మానసమతిం దియగు నయ్యండజ వేదండవాహనుని యానతి వినోదార్థంబుగా వనవిహారంబుసేయ వేడ్క నొంది, యొక్కతే రెక్కి మక్కువ నిక్కనొక్కటకుం జనిరి. అయ్యెడ నవ్వైశ్వానరుండు లోఁగడ మరుత్తను రాజర్షి వరేణ్యుఁ డొనరించిన ద్వాదశ శరత్పరిమితం బగు సత్రతంతువునందు నతిపీవర కరటి కరక్షీవ రాకార పర్విధాగార్పణంబున హతుండగుట, నాప్రాజ్యం బగు నాజ్యంబును జీర్ణింపం జేసికొన నెరవరి కానేరక, తత్ప్రయుక్తం బగు నామయంబున నిరోజుం డగుటచే దుర్బలుండై, యాశ్వినేయుల నడుగ, వారలు నీ కియ్యుత్పన్న శిక్షింప నొక్కభేషజంబు గల దది సేవించినం గాని నీ వగదుండవు గావు. అద్ది యెద్ది యంటి వేని, ఖాండవంబను నాఖండలు నారామంబు గలదు. అది సమగ్ర దివ్యౌషధి సత్త్వభరితంబు; దాని నిశ్శేషంబుగ నాస్వాదించితి వేని, నీవ్యాధివలననైన వ్యాధి బాధ్యం బగుఁగాని, పెఱవెరవు నెరుంగ బడదని వారు వక్కాణించిరి.

### అర్జునుసాహాయ్యమున నగ్ని ఖాండవము దగ్ధముఁ జేయ నింద్రుండు వెల్లుగవర్షించి విఘ్న మొనర్చుట.

అదియాదిగ, నాదమునుండును గడుజలినంబున నా కృష్ణులఁ గాంచుటకుఁ గాచియుండి, యాత్తిజే నియతిని యోగంబున సంచితయోగుండై, వారింగని యతిముతి గైవారంబు



సేసి, తనక్రచ్చు వెలిపుచ్చిన వారలు సవినయ వనీపక ప్రకరంబునకు సురవన పరిష్కరణ నిపుణకటశైలీ వాటంబు లగుటం జేసి, దయామయహృదయు లగుట నాధనంజయు నిరామయుఁ జేయంబూని, యతఁడిడిన గాండివం బను కాండాసన ప్రకాండంబునఁ దరుగని యాపరలసొంపు సంపాదించు బత్తలికలఁ దాల్చి, యయ్యచ్యుతాభిమతంబున నావనజాతునకు నావనజాతం బెల్ల నారోగణంబు సేయ నాయహిగరుడసూనుఁ డొసంగె. అపుడు వారల బాసటఁగొని యయ్యనలుం డాభీల జ్వాల సంఘాత భైరవుం డగుచుఁ గల్పాంత భైరవు ననుకరించి మించి, యాఖాండవంబు సాపడుటకై కొంకక యుంకింపనంతట నక్కింకరులచేతఁ దనటీకుత్రోటకు వాటిల్లినసంకటంబుఁ దేటగాఁ దెలిసికొని, యకులిశపాణి యక్కు గొట్టుకొనుచు, రవరవ యగుచిందగ జెందఁబునఁ గ్రందుకొన, నాయగ్గి నగ్గాడ, వెగ్గలంబు లగు మొగిళ్ల నంపి, వారిని జక్కాడెద నని తెరగంటి దొరయైనను, దాను కినకను చీకువాలుచే నావరింపబడుటఁ బోలె కను మొరగిన పెన్నెరుక గలవాఁడగుచుఁ బెనుకువ గావింపఁబూని, నిర్నిరోధవరూథినీకుఁడగుచు, నతిశపిత భుజంగ భోగభీషణంబు లగు శరవర్షంబుఁ దనపర్జన్యతకు నన్వర్థతఁ బ్రకటించువాఁ డగుచు, వానితోడ నతిని బిడంబుగఁ బ్రసరింపఁ జేయుచు, మోహరించె.

## అర్జునుఁ డస్త్రపంజరము నిర్మించి, ఖాండవము నిశ్శేషంబుఁ జేయించుట, మయుండు రక్షితుండై చిత్రమగు సభ నిర్మించుట.

అంతట నక్కవ్వడి దండిమగండు కావున, బెడిదంబులగు నంపరల నమ్మిటారంపుతోఁట నంతవట్టునుఁ జుట్టు మీఁటఁ బందిరిగట్టుగఁ గట్టి పెట్టిదంపుములుకుల నజ్జేజేలఱేని దండుతోఁ గూడ బెండుపఱచె. అంత నయ్యంటరానిదంట పుయిలోఁట దాటించి, యత్తోఁట దనమంటలకుఁ బాలుసేయ నయ్యర్జునంజునుఁ దిండికారులకుఁ గార వగుమయుం డయ్యెడ నంటఁ బాఱుఁడుగావున, వెలికిఁ బోవఁ గమనించి పఱికించి, యాలోచింపఁ జుట్టును దట్టంబుగ నున్న యయ్యంపరకట్టుకు మింట నంటియున్న యమ్మంటలకుఁ గొఁటువడి, యంజికచే రంజింపం బడుచు నెద్దియు వెలువుంగానక, సంతర్పిత ధనంజయుం డగు నాధనంజయుని శరణంబు వేఁడిన, నమ్మహాభాగుండు వాసుదేవుశాసనంబున నమ్మయుని యాయుంగలార్పవలనఁ దొలఁగించె. పదంపడి, యపూర్వపుపర్వవఁగకి కృతజ్ఞుండుగావున నొకనాఁడు నోలగంబున సోదరులతోడంగూడి యాయదుకులకలశవారాశిచంద్రుని చెంత నాబుధునిఁబోలి యున్న యగ్గాండివకోదండునిఁ గని మిగులఁ గొనియాడి, నానేర్చినకొలఁది నీచేసినయొగ్గుకుఁ గలువలచెలి కొక నూలుపోగనునయంబున, నీకెద్దియైనఁ గొఱగలుఁ నొకయరతం బిచ్చెద. మచ్చికచే దానిఁబుచ్చుకొని నాయిచ్చమెచ్చులకు మచ్చుగా గారవింపు మని మగుడమగండ దండితనంబునఁ గొండాడె. అంత నాశంబరజనురంబకుఁ డమ్మయుర



గని యుధిష్ఠిరునకు నొక నొడ్డోలగంబును, పార్థునికి నొక్క గుదియయు, నీవిజయునకు నొకవిజయాంకం బగు శంఖంబులలామంబును దెమ్ము పొమ్మనిన, నమ్మయుండు సొమ్ముల నిమ్ముగ నొందిన యమ్మందునివలె, నెమ్మనంబున నమ్మదంబు నొంది, వల్లె యని వారిచేత ననుజ్ఞాతుండై తనతావునకుఁ జనె.

## మయుని నిర్మించినసభను వర్ణించుట.

అంత నమ్మయుం డిట్లు నని, యొకసరోవరంబునఁ దాను మున్నుఁ దాఁచినట్టియును, స్ఫటిక శశిలోచన కదళీదళ కరవాలచ్ఛాయలచేతఁ బ్రకటితకులచతుష్టయంబు లగుచుఁ, గోసలకళింగమాతంగ హిమవన్మహారాష్ట్ర సౌవీరపాండ్ర హేమప్రదేశంబుల జనించుట శిరీషాభ చంపకచ్ఛవికుంద ద్యుతిశుభ్రాభ శోణప్రభ కృష్ణవర్ణోత్పలరుచి పింగళోజంబు లగుచు, శిరీషపుష్ప మోచాచ్ఛదవేణు పర్ణసవర్ణంబు లగుట వైష్ణంబులనియును, శుక్లపడక్ర తాలక్షణంబుల మాహేంద్రంబులనియును, శృంగోత్పలాభంబు లగుట యామ్యంబు లనియు, కింశుకాభవంబు లగుట వాయవ్యంబు లనియు, కర్ణికారప్రసూనవనిభంబు లగుట వారుణంబు లనియు, శక్రగోపసంకాశంబు లగుట సౌరంబు లనియును, నంగార ప్రభవంబు లగుట నాగ్నేయంబులు నగు వజ్రంబులును, కంబూదరసరోజాతంబులగుటఁ గపోతాండపాటలీకుసుమ సమవర్ణంబులును, జలధరసముద్భవంబు లగుట నుద్యచ్ఛాయాప్రియ సచ్ఛాయంబులును, వంశజంబు లగుట వర్షోపలసన్నిభంబులును, ఘృష్టి దంష్ట్రోద్భవంబు లగుట రక్తద్యుతులును, భోగిభోగప్రభవంబులగుట

నీలప్రభాభాసురంబులును, నిభదళనసంభూతంబు లగుటఁ జీత
కాంతిసంవలితంబులును, తాదృశచ్ఛ విచ్ఛురితంబులగు పుండ్రే
క్షుపర్వ శాలిస్తంబ సముద్భవంబులును, శుక్తిజన్మంబు లగుట
సోమసమానధామంబు లగుచు దశవిధంబు లగు స్వోత్పత్తి ప్ర
భవభేదంబుల విభిన్నజాతు లగుచు, వర్ణాల్పతాశేషా త్రాస
శాశపదబిందు సమవిధానంబు లగు మహాదోషపంచకంబు
చే వంచనఁ గాంచనట్టివియును, సుతారతానువృత్తత్వ నైర్మ
ల్య ఘనతాస్నిగ్ధత్వాస్ఫుటితత్వంబు లను షట్సంఖ్యాకంబు
లగు సుగుణంబుల గణనీయంబు లై, జలజస్థలజతా విశేషం
బున బహువిధవర్ణస్ఫురణ భాసురంబులు నతిస్థూలంబు లగు
ముక్తాఫలంబులును, కల్హారఖద్యోత దహన సంభృతాక్షి దా
డి మబీజతప్తిసూన శక్రగోప ప్రముఖ దశకతుల్యచ్ఛవు
జాతిలగుట ద్వి సజాతీయంబు లగుచు జాతరంగ నామాంత
రంబున నింపొందు పద్మరాగంబులును, లోధ్రకింశుక బంధూ
క జపాకుసుమగుంజాబీజత ప్తలోహాద్యష్టక సమరుక్కు లగు
చు క్షత్త్రియజాతీయంబు లగు కురువిందంబులును, లాక్షా
కోకిలేక్షుణాశోకకిసలయశప్తలోహాది షట్కద్యుతీ విద్యోత
మానంబు లగుచు వైశ్యజాతీయంబులు నని యెన్నఁదగు
సౌగంధికంబులును, కుసుంభ కుసుమపక్వబింబ కురవక ప్రసవ
ధాతు విశేషచతుష్టయ దీప్తిప్రదీప్రంబు లగుచు నీలగంధ్యా
భిధాన విశేషంబున నింపొంది తురీయసంతతికంబు లగుగవాం
బువును, దూర్వాతులసీకలమాగ్రదళరుచికంచుకితం బగు
గాఢత్వగుణంబున నతిశ్లక్ష్ణతాలక్షణీయం బగు నుల్లసితత్వంబును
కలమాగ్రసదృశతను జెన్నొందు పేశలత్వంబును కీరగరుద్రు



చిర మించు పిత్తతయందుల శ్యామత సొంపొందు ముగ్ధత్వం
బును, బద్మపత్రసతేజస్కత నుల్లసిల్లెడి పృథుకత్వంబును జాతి
షట్కంబుచే నెన్నందగి నిర్దుష్టంబు లగు గారుత్మత రత్నం
బులు నీవచ్ఛ్వేతకించి ద్రక్తశ్వేతశ్యామాత్యంత కృష్ణత్వాట్కత
జాతుర్వర్ణ్యంబు లని ప్రశంసింపందగు నీలంబులు నింద్రనీలం
బులును మహానీలంబులును, మధుబిందు గోమూత్రగవాజ్య
సప్రభంబులును స్నిగ్ధహాటకసవర్ణంబులును గురుస్వచ్ఛస్నిగ్ధతా
గుణాగణనీయంబులు నగు గోమేధికంబులును, సుశప్తతపనీయ
విమలపరిస్ఫురదంగారప్రతిమానధామాస్పదంబులును సుస్నిగ్ధ
బంధురంబులు నగు పుష్యరాగంబులును, వేణుపత్రబిడాలాక్షి
శిఖికర్ణసముద్యుతు లగుచు స్నిగ్ధగాత్ర గురుస్వచ్ఛతా గుణం
బులఁ దుచ్ఛంబులు గాక దక్షిణాద క్షీణపశ్చాత్త్వరః ప్రసన్న
తేజస్స్ఫురణంబులు గాన చాతుర్వర్ణ్యవర్ణనీయంబు లగుచుఁ
బ్రశస్తంబు లగు వైదూర్యంబులును, సంత్రాశయచ్ఛిద్రవక్త్రి
క్రిమిదూషణత్స్వరూప దోషత్రయవర్జితంబు లై సంపుల్లకిం
శుకప్రసూన పక్వబింబఫల జపాకుసుమ శుకతుండ రుచుల
వంచితంబు లగు విద్రుమంబులును, పుష్పవత్కిరణ ప్రసరణ
మాత్ర సముద్గీర్ణజ్వలనహిమాంబు పూరంబు లగు సూర్య
కాంత చంద్రకాంత మణులు నను నామంబులఁ జెలంగునట్టి
యును, మిసమిస నెసఁగు విసరంబుల ననదృశంబు లగుచు నల
మంచిమించుల నలవరించి సంచితవంచనంబులుగా నొనరించు
నిగనిగలఁ జూపరులచూపులకు మిరుమిట్లు సేయనోపు మిసు
కులకరకరల నతిముతి చిఱచిఱలాడు నత్తమప్రస్తర ప్రకరం
బుల నఖల దివ్యగంధర్వాదుల నొడోలగంబుల దొడ్డతనంబుల

పెద్దలుగాఁగఁ జేయఁజాలునట్టి మిన్నతనంబునఁ జెన్నొందు నటుల నొనరించి, తన విచిత్రకాంతి ప్రతతుల నఖిలపశ్యజ్జన చేతంబులఁ జిత్రపాత్రంబులుగ నొనరింపఁజాలు నమ్మహానీయ మహః ప్రరోహ సంహతి సంహృతం బగుట నల రోహణ గహ్వరీధరంబునకు విహ్వలతఁ గూర్ప నేర్పరియై యేర్పడిన యాసభామంటపంబుఁ బెనులావరు లగు దచ్చి వేలగండ దిండులచే నూనించికొని తెప్పించి, యావైన స్వకీయునకుఁ గానుకఁగా సమర్పించి, గాంధవాహికి సకలశత్రుఘాతిని యను సువ్యక్తవ్యుత్పన్ననామంబున మిన్నయగు గదయును, పౌరందరికి బరహృదయ దరదనినదం బగు దేవదత్తం బను నొక దరసత్తమంబును, నిడి, సవినయనయభక్తియుక్తంబుగాఁ గొనియాద్ధ వయ్యెడ దండధరతనూభవుండును దండియై యింపొందుపొందున నతనిని గారవించి పుత్తెంచె.

## యుధిష్ఠిరుండు రాజసూయంబు నొనర్చుట.

పిదప నయ్యజాతశత్రుండు సకల సద్గుణ సంవృతంబగు నా వైవస్వతవర్మయుండు సమగ్రకళా పూర్ణరోహిణీ రమణుండో యన నట్టియొడ్డోలగంబున హాయులు బయలు మించి వెంటమ్ములపొంటె దంట యగుచుండ, నలునాసలం దనతేజంబుత్తములకుఁ జంద్రాతపంబును, పెఱవారికి శుక్రాతపంబుగాఁగ, నర్మిలి నర్మదు లగు సోదరులతోడఁగూడి సుఖంబున నుండె. అంతట నతఁ డొక్కప్రొద్దున నచ్చివ్వబువ్వరివలనఁ దనజనకుండగు పాండుభూవరుండు రాజసూయ సవనంబు వేసరక నేయింపు మను వాచకంబుఁ దెలిసికొని, యకంపశాసనుని శాసనంబునఁ బరపురభీము లగు భీమాదులు నలుదెసలఁగల రసాధీశులఁ దమ బెట్టిదనంబున మట్టుపరచి, జోతనేతరులఁ గాఁజేసి వారివలనఁ బరంబు లగు కరంబులు మిగులఁ గరంబులబలిమిఁ గరంబుగఁగొని దన కొప్పగింప సాపుల నలరి యరిమర్దనుండగుచు, సకలభూవిభూషాసితుండై విధివిహిత విధానంబున నమ్మహామఖుం బతులిత మహాంబు గా నొనరించె. అత్తరిదచ్చికడలతడలనుండి యేతెంచినట్టి మన్నెకాండ్రును, దక్కిన పుడమిఱేఁడులును పారువాదిగల దగిన పెక్కువంగడంపువారలును తద్దయుం దరి దమరాక కెదురుసూచుచున్నట్టియు కలుముల బలుములఁ జెలువొందు క్రొత్తచుట్టల యిరవుల మిగులఁ గారవంబులు గాంచు పగిది, దమయిచ్చలకు మెచ్చులుగాఁగ, బలుదెరంగుల వేడ్కల ననుభవించు చుండిరి. 



పిమ్మట నయ్యుధిష్ఠిరుండు నానాదేశాగతు లగు నయ్యందఱకుఁ జెందంబుల మిగులఁ దటుకపాట సూటి నైబుట్టినట్లు వెలదాటినపుట్టంబులును, రవణంబులును మొదలుగాఁగ నెవ్వరకు నెవ్వి హాళిఁ జేయు నట్టివస్తుజాతంబులఁ బ్రశస్తాదరంబున నిచ్చి, వారలఁ బనిచె. పదంపడి కొన్నిప్రొద్దులు జరుగఁ దనపితామహుం డగుభీష్ముండును, పెద్దయ్య యగు ధృతరాష్ట్రుండునునాదిగల సకలబంధువర్గంబులను ద్రోణాదిగురుజనవ్రాతంబును దక్కిన చెలు లాదిగల కరినగరవాసులను బహువిధంబుల సత్కరించి వారియనుమతంబున నంపె.

అయ్యెడ నద్దుర్యోధనుఁ డమ్మహాస్థాన మంటపంబు చెలువంబుఁ జూడఁ దనివి దీరక, గడువేడుకఁ జెంది పెక్కుపవలున దాని రామణీయకవైభవంబుఁ గాంచుచుండె. ఒక్కనాఁడు నిజ



మాతులుం డగు శకునితోడఁ గూడి క్రిక్కిరిసిన చక్కదనంబునఁ బిక్కటిల్లు నచ్చుక్కల పక్కియలఁ దిరుగుచు, నొక్కచక్కి నత్యమలమహోపలంబుల నిగనిగలవారంబుల వారంబులఁ గాఁ గని, తనయొడలఁ దొడగిన మడుగులు దడియునో యని తలంచి పైకి నమర్చుకొనుచుఁ జని చని తోరం బగు నీరంబుఁ గానక వెఱఁగుపడి, యాహా! యిట్టి మెఱుఁగుల వెలింగెడి రత్నంబులు గలవేయని నివ్వెఱ నివ్వటిల్ల నడచె.

మఱియు నొక్కచక్కని నిక్కంబు లగుసమూహంబులఁ గని, తొల్లింటియట్లు పెల్లుగ నల్లసిల్లు మగకల్లుల మెఱుంగు జిగులదంబగ లని కొనియాడి శంకఁగొంకక బింకంబునఁ బొంకంబుగా నేఁగి, తనయొడలఁ దొడిగినమడువులు మెండుగ దడయఁ బడఁబడిఁ బెండువడి, కడువడిఁ దడఁబడుచు మగుడ దరిదండకు నేఁగుచుండ, నయ్యెడ నడముడి ద్రోవది తోడఁగూడి తనయొడలింగాంచి మేలంబున మెలంగుచు నగుచుండ, వెడగుతనంబునఁ జిడిముడిపాటు వడియె. అప్పు డజ్జమునసైదోఁడుగన్నకొడుకు దానింగని కడువడి నవ్వుడమితేని యడరుఁదొడరింపఁ గడఁగి, విలువకు వెలి యై, చెలువొందు వలువలఁ దాల్ప నంపి; పిదప నతనింగలసి లాలించి మన్నించె.

పిదప నాగాంధారీనందనుం డజాతశత్రుఁ డొసరించిన పెచ్చు లగు మచ్చికలచేఁ దొచ్చంబులు గానివెచ్చంబులచేఁ దనగ్రచ్చులు విచ్చలవిడి మెచ్చులకు మచ్చులు గాఁగ,నిచ్చలు పెచ్చువెఱుంగఁ గొన్నినాఁడు లవ్వాడ నుండి, మగుడ నతనిచే బలువంతు లైన వెలలకు నెలవు సేయఁజాలక మేనుఁబూనిన యక్కలుముల చెలువకులుకులంబోలి చెలువొందు మెఱుఁవు రా



ల రవణంబులును, రారాజుల యలంకారంబుల కనకూలంబులైన దుకూలంబులును, జందురుకావులును, జెంగావులును, మంజిడులును, మొదలుగల పలుతెఱంగుల దువ్వలువలును, గఱిగుబ్బలయుబ్బులంబోలి యలమబ్బులఁ బ్రబ్బఁజేయు గబ్బుచెంప మెకంబులను బడవాగులు దేజులు కతలాను లాదిగల మావులును, మఱియుబలెఱంగు లగు నిస్తులప్రశస్తవస్తుస్తోమంబులును ఖారితోపీకంబులుగ నిచ్చి గారవింపఁబడి తన నగరంబునకఱిగె.

## ధర్మజుండు శకునితో జూదమాడి యోడుట.

పదంపడి వాఁకు దుండగీఁడుగావున, నప్పాండవుల బలిమికలుముల కులికిపడి, దండితనంబునకుఁ గడు నదరి, యమ్మాతులునిమంతనంబున వారిసంపద నవారిగ నపహరింపఁగోరి,యడియానచేఁ గడు మడసిన తెలివిడి గలవాఁ డగుచు, గిటుకుజూజంబునఁ గాని పెరవెఱవున వారి నలవరింపరా దని నిక్కువంబుగాఁ దలఁచి యాశకునిచేతఁ దనయానకు నివ్వచ్చరంబు దొచ్చంబు గాకుండఁ దండ్రి నొడంబఱిచి, తాతయానతి వారల రావించి కాంచి. మించిన యొచ్చరికతో ముచ్చట లాడి, మన మిచ్చట పెచ్చిన హొడగు దిరంబు గాఁగ సొమ్ముల నిమ్ములుగా నొడ్డి నెత్తమ్ముల రంతువెలయింపఁ దగు ననిన, నాకీనాశనందనుండు వానింగని, మన కిది యుర్వాంబుగా దని యెన్నిమారులు నుడివినను, వాఁడు గడు మోసకాఁడు గావున, నాతనిఁ బురికొల్పుట కై, నీచేత నయ్యేనేని యాడందగుఁ గానినాఁకు నేనాడఁగలవాఁడను, గా నంటి వేనివునుడుగు టఖు నక్కెను.

అయ్యెడ నప్పుడమిఱేఁ డట్లు వాక్రుచ్చుట రాయరిక మ్మునకుఁ దనరినది గాకుండుటయును బవిసికట్టుకుఁ బట్టుబట నుబట్టి సారెసారెకుఁ దనముందల సారెలంద్రొబ్బు శకునిఁ గని యోయీ! చుట్ట లబు మనకు నిది యలరకుండుటంబట్టి యిట్టు వక్కాణించితిని; గాని చేతరిగనంబు లేవడివడుటఁ గాదు గదా! అని పలికి, యాగాంధారేయుఁ గని, యోయీ! నీవ యాడందగు రమ్మనిన, నాతండు దురోదరవ్యాపారంబునందు నొనరిన వెరవరితనం బెద్దడింబట్టి తద్దయుఁ దానాడ నోడి, యోయన్నా! నాకు మారుగా మామామ యాడెడు నీవొడ్డెడు పందెంబులకు మాత్రె తగినపణంబులకుఁ దగినపెక్కుచొప్పు లగు సొమ్ముల నొసంగెద ననిన, నప్పాండవేయ వేదండుండు నక్షశౌండుఁ డగుట నందుల కొడంబడి, పెక్కురూపు లగు తనకలుముల నెల్ల వెల్లిగా నోలి నొడ్డి జాణ యయ్యును, వింత యబు వానిబలవంతంబున వంతలకు నిశాంతం బై యుంతంబునొందిన నలంతికాని వలంతితనంబు గలుగుటం జేసి, యున్నిటఁ గోల్పడి, పెండియు నాడుటకుం గొల్పడి, తుట్టతుదకుఁ దోడఁబుట్టువులతోడఁగూడఁ దనమదతుకఁ దన్ను నొడ్డి, యొదిరి నోడింపఁబ్రోడ గాక, కోల్పడి వారల కూడిగంబులు సేయఁ జాల్పడియె.

అట్టియెడఁ గొంటుతనంబున గంటుమీఱి యారారాజు నిబ్బరం బగు తనమామ గిబ్బికి మిగుల నబ్బి యబ్బరంబు గాఁగ సిబ్బితిమంబ్బు సెందిన వారలఁ గని, వీరల నందఱఁ బండెమ్ముల నందుకొంటి నని కొంటెతనంబునఁ బలుమాఱు లార్చుచు, నందఱికిఁ గొనియాడందగు నదేవి నత్తఱి కెరగు

మాసియున్న దని యొకింతయుఁ గొంకక, పొంకం బగు బింకంబున శంక వీడి, తనతోఁబుట్టు వగు దుశ్శాసనుచేఁ గొలువున కీడిపించి రావించి, పతులు గనుంగొన నాసతి దాడగినమడువు లుడిపింపఁ గడంగె.

—ద్రౌపదివస్త్రాపహరణము-భీమునిఘోరప్రతిజ్ఞ.—

అయ్యెడ నమ్మార్తాండపుత్రుండు గడునీతిజ్ఞుండైనను, బాండవులు దనకెన్నఁడుఁ గంటునంటి చెట్టసేతరులు గాకుండినను, బెట్టిదం బగు వేగంటిపట్టి జెట్టితనంబునకు నెట్టన వెట్ట నొందువాఁడుగావున, నాతనింబట్టి యెల్లవారలుఁ దెల్లంబుగ నాలింప, నుల్లంబుల వారల యుల్లంబుల నల్లనగాకుండ నల్లలంజేసె అప్పు డప్పడతి మొండుగ వెడగంది, తత్తరంపుపాటునఁ బత్తులసొత్తగు నత్తమ్మికంటి నత్తఱిఁ జిత్తమున హత్తించి.

హా! కృష్ణ! ద్వారకావాస! క్వాఽసి యాదవనందన, ఇమా మవస్థాం సంప్రాప్తా మనాథాం కి ముపేక్షసే? యని పల్మాఱులు దేవిరింప, నంతట నాదుష్టుం డాయమామే యివలన మొట్టలంబోలు పుట్టంపుఁగుట్టలు జెట్టితనంబునఁ బట్టి పట్టి యొట్టట్టునఁ గొట్టువడక కట్టువిప్పిన నార్తసంత్రాణ బిరుదధ్వజుం డగు నాగరుడధ్వజుని గబ్బితనంబున, నుబ్బు నిబ్బరికంబున మన్నన విన్నన వోక, యున్నయమ్మానినిఁ గని, సిగ్గున గ్రమ్మె.

అపుడు కిమ్మీరవైరి వాంద్రతీంద్రతనంబులఁ గాంచి, తనగోరగింత నచ్చదుకు వా రెదుగగ నాలోకింపఁ జాలక పొంకంబున నుంకించెడిజంకెనచేఁ గొంకువడిన బింకంబులు గలవా రగుచు, నంకసంకలిత సంకటంబులు గలవారింబోలె

నేలందూలిన చూపరు లగుచుండ, ద్రుంగడంపఁదనునదనం బగు కనుకనుపునఁ బాలివీఁడి, యెల్లమెయిదారుల నురుమాడ పాలినొందిన యమ్మహాభైరవప్రకరణి, భైరవాకారుం డగుచుఁ దాలుతనీబేరజుండు దురంబునఁ జూచుచుండ, నిద్దేవి కేశవ పనంబుల నాకర్షించిన మొండికట్టైను నెట్టకేని దిట్టంబుగ దట్టించి యిగ్గుదియచేత నిమ్ముగ వానిరొమ్ము నెమ్ము లెల్ల వమ్ములుగాఁ బగిల్చి గెల్చి వానినెత్తురుఁ దత్తరంపుపాటు వీఁడి, మధురశీతలతాది గుణధురంబు లగు క్షీరభరంబులఁ బోలి, కడుపారఁద్రావి, యిక్కోపసంతాపం బుపశమింపఁ జేసెను. మఱియు నిమ్మానవతి కిమ్ముగఁ దనకుగు విరువుసేయ సైగసేసిన యక్కురుపాంసనుని పెద్దొడలు భండనంబునఁ బ్రచండం బగు నిగ్గదాప్రకాండంబున శౌండతాప్రచండవేదండపుండరీకంబు సముద్దండశుండాదండంబున నమ్మహీరుహప్రకాండంబులఁ బోలి ఖండించెను. ఒం డేనిఁ జౌవంచ బల్దోసంబులకుఁ బొసంగుపాటు నొందు నని ప్రతిన సేసె.

—❁ దుర్యోధనుని పునర్ద్యూతప్రయత్నము. ❁—

పదంపడి యయ్యాజ్ఞసేని, తన వెరవునఁ బెదమామ వలనఁ దమ కక్కడగండ్లు వోవ వరంబులు గొని, యనాథు లగు తననాథుల వెండియు నిజసంపత్సనాథులఁగాఁ జేసి వారలతోడ మగుడఁ దన నగరంబున కఱిగె. పదంపడి యాదుర్యోధనుండు బెండువడినడెందంబుతోఁ దనమామతోడ వెండియు నిట్లని చింతించె.-- ఆహా! పాండవుల రాజ్యంబు సస్వామికంబుగ మన కధీనం బయ్యును, మాయప్ప వెరవుఁదప్పుటచే లాతుల తిప్పలు మన కుప్పతిల్లె. ఇత్తఱి వారలకుఁ దొరతనం



బిచ్చుట యల త్రాఁచులకుఁ బాలువోయుట గాదె? మఱియు వారి నిత్తఱి విడుచుట, మనకలుములకు వారి విడుచుటగాదె? పెక్కుదఱి బోనులోన నఱిగట్టి పెట్టినబెబ్బులి నిబ్బరంబునెడి యబ్బయలునకుఁ ద్రోలుటగాదె? అయ్యయ్యో! కయ్యంబున వారిఁ గెలువనయ్యంబరచికురునకైన నెయ్యంబు గాదు. కాన మనకిఁకఁ జేయంగల దేమి యున్నది? అడవులం దాన యయ్యెనేని, బుడిపిబూని బికిరాలమారితనంబున నెల్లపుడమిఁ దిరుగుచుండవలయు. మగంటిమి నంటె నేని, గొంటుతనంబు వీఁడి మంటలనంటవలయుఁ గాని, యొంటిమిచే నేమి గలదు? అని యివ్విధంబునఁ దనదురాశయంబు జీవననిరాశంబుగా వినిచిన, నయ్యక్షకలాదక్షుండగు శకుని తత్క్షణంబ యయ్యదక్షవీక్షణుం డగు క్షమారక్షకుపాలికి సుయోధనుఁ దోడ్కొనిపోయి, యాతనియాశయంబు శ్యాలకునకుఁ దెలిపి, యెట్టకేలకుఁ బాండవులచేత వెండియు జూదంబాడించుటకు నొడంబఱిచె. అంత నక్కాణధరణీరమణుండు పాపచాపలుం డగు పావని యందలి యరులకు పురిగొను నురుల మిగులందగిలి, యక్కనటునకుఁ బుయి లోటపాటు వాటింపక, కొమరుగఱపువానిఁ బోలె వెండియు సైఁదోడుగొడుకుల సుద్ది పుత్తెంచి రావించి, వారిసౌఖ్యంబులకు మారకుం డగుకుమారకుని కొప్పగించె.

ధర్మజుఁడు మఱల నాహూతుఁడై జూదమాడి

ఓడి యిడుమలఁ బడుట.

అంత నాదుర్యోధనుండు ధర్మసుభగు లగు నాధర్మసుతాదులఁ గని, మీరు తిరిగియు దురోదరం బాడవలయు. ఇపుడును దొల్లింటియట్ల దురోదరం డన్నన్నాతులుండః కాని

యిద్దురోదరంబున నభినవం బగు దురోదరంబు దిరంబుగనుండ వలయు. ఎట్లనినఁ నియ్యాట నయ్యాటంబున నాఁడుచుండ, నెవ్వం డోడునో, వాఁడు నాఁడు వీఁడి జడదారితనంబున కొడం బడి, య్యారాతేండ్లు బేరడవుల నుండి, కడపటియేడాదిని వాఁడుకఁజెడి, యొరు లెఱుగకుండ నొడలు బయలుపడనీక యుండునది. మఱి, అన్నాఁళ్లుల నెన్నండేని గట్టిడిని దట్టింపం బడి కట్టడంగొట్టెనేని క్రమ్మఱ నుబితివక్కణ నిక్కంబు గాఁగ వర్తింపఁదగు. ఇత్తెఱఁగునఁ జీటికిమాటికిని బందెంబునఁ గుండె నేని సందియంబు గొనక, నంతనింత యని యెన్నక, యెంత యడను నైన నిట్ట యరిగింపవలయు. అట్టిపణంబు నీ కను గుణం బగునేని నీ వన్నితెఱంగులఁ దిట్టవై తేని నాకు బదులుగ నుండు నీసొబలునితోడ మగుడ నాఁడుమని తనకు విత్తమ్ములంబోలి గుత్తమ్ము లగు నెత్తమ్ముల నమ్మహీపతి కాయత్తమ్ములఁ జేసె. అంత నయ్యంతక సుతుండును వింత లగు తొల్లింటివంతలు దురంతంబులై సంతతంబు స్వాంతంబు ననలకీనలంబోలి, కాల్చుచుండినను, నియతివంచితుండై "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ" మ్మనువిధిచే మగుడ నాచెడుగుతోడ నాడి, యోడి వాడవెడలి కాఱడవులకు న్వడలె.

### యుద్ధంబున ధర్మజులు దుర్యోధనాదులఁ గూల్చి సామ్రాజ్యంబు ననుభవించుట.

అంత నాధార్తరాష్ట్రుఁ డుప్పొంగి, యఖండ భూమండలాధిపత్యం బనుభవించుచుండె పిమ్మట నప్పాండవులు వంజప్రకాండ కాండుం డగు యదువేదండుని యక్కటికిఁ గక్క-



సంబులును వెక్కసంబులు నగు దుక్కంబులకుఁ బొక్కసంబు లగు నగ్గడుల వెడలించి, వెండియుఁ దమనాఁడు వేడ, వాఁడు దొలుతఁ దనవారలఁ గరకరిగలాఁడు గావున, మఱియును వెను తఱిఁ జవిగొన్నవాఁడు గాన, నానాఁడు వీఁడలేక, తోడ్తోన యేడ్తెరకుఁ దోడ్పడు పుడమిఱేఁడులఁ గూడికొని, కడంగి వారలచే ననుజతనుజసుహృజ్జనగురుబంధు ప్రకృతిజన ప్రముఖసహితంబుగాఁ బదునొకండక్షోహిణుల నాక్షోణికిఁ బలి గాఁగఁ, బిమ్మటఁ దృణీకృత నిజభీమసేనుం డగు భీమసేనునిచేఁ బెనకువ నతండు దొలుతఁ జేసినవంతంబు వింత యై జూపట్టఁ గట్టకడకు మట్టగింపఁబడియె. కాన లోభంబు గలిగె నేని, వాఁ డెంత బలవంతుం డైనను గుముదారవింద సౌగంధిక ప్రముఖప్రసూన బంధురాగాధకబంధబంధురం బయ్యు, నాళచ్ఛేదంబున హ్రదంబుచాడ్పున యనుచితం బగుస్వస్వామిచేత సకలాప్త సంపత్కుం డగుచు నిర్జీవుం డగు

### —మంత్రి మదదోషము నుగ్గడించుట.—

మదంబు నా యత్కించిచ్ఛక్తియుక్తిఁ జేసి, పురస్కరింపఁ దగినవారలఁ దిరస్కరింప నుద్యోగింపఁజేయు హృద్వృత్తివిశేషంబు. వైకల్యంబు నొందనివి గావున సంకల్పంబునఁ గల్యంబు లగు నాయనూనశక్తులశేషభువనజననసమవనదమనదక్షుం డైన యొక్కపరమేశ్వరునంద యందంబుగఁ జెంది, యప్పు లప్పారావారంబునందుఁబోలి, నిండియుండు. మిగిలిన నెలవులఁ దఱఁబట్టి తరతమతలఁ జూపట్టుఁ గాని, గట్టిగఁ గట్టువడి నెట్టనఁ గన్పట్టవు. మఱియు నవి యొట్టివయ్యును, మదువున నిమిడియుండు పడగదారులకై వడి, ప్రమానులం దడఁగి

చెన్నొందు చిచ్చులకరణిఁ, గల్లులఁ గడుపుల నడంగురతనం బుల చాడ్పున, నెల్లవారికిఁ దెల్లంబులు గాక, యదనయినఁ బెల్లుగ నుల్లసిల్లి, తమతమకర్జంబు లొనరించి యిజ్జగంబునఁ దేజరిల్లు; గానఁ దెలివిడికాండ్రు దీండ్రతనంబునఁ దామ పోటరుల మనుచు, నేరినిఁబరికింపంగ నలుసుసేయఁ దగదు. ఇందుకు నొకనిదర్శనం బుపన్యసించెద.

—హిరణ్యాక్ష హిరణ్యకశిపులకథ.—

మున్ను కశ్యపతేజంబున దాక్షాయణి యగు దితి సుతుల నిరువుర హిరణ్యకశిపు హిరణ్యాక్షు లనువారలఁబడసె. అం దవరజుండు మహౌజుండు గావున, దైతేయుం డగుటం జేసి, యాదితేయుల సకలసాధువులతోడ నాదితేయులఁ జేయుచుం డె. అంత నఖిల ఖలకులవినేత యగు నారమానేత, ప్రణతజ నశరణాభరణుండు కావునఁ బుణ్యజనకంటకుం డగు నాపుణ్య జనగ్రామణిని సంగ్రామంబున నుగ్రాగ్రఘృష్టిధాముఁడగుచు నాయుగ్రఘృష్టి ప్రభవధిష్ణ్యంబునకు నావేశికుఁ జేసె.

పదంపడి నాహిరణ్యకశిపుండు పుండరీకాక్షుచేత దండధ రునండకుఁ బంపంబడినవానిఁగ నెఱింగి, తదీయవియోగజ శోకంబున నెగులులంబొగులుచుం దగువిందులచే నూరడిం పఁబడి పరిపంథినిర్నాసంబు సేయసమకట్టి వైశాఖశిఖరిదరీ గర్భంబు సొచ్చి, హిరణ్యగర్భు నుద్దేశించి తనమేనఁగల యసృ జ్మేదోమాంసంబులు త్వచంబుతోఁగూడ గహనమక్షికా పిపీ లికాదులచే నారోగణంబుసేయఁ బదశల్యమాత్రావశిష్టుండై వెండియుఁ దనమేన దిట్టంబులగు పుట్టలు దట్టంబులుగాఁ బన్న బన్నంబు నొందక, వానిమీఁద వివిధతృణకంటక గుల్మంబులు



నిబిడంబుగఁ బొడమఁదన సమాధి విధానంబున నచ్చట నత్తు ఫలోదరంబునం దనూన పాత్రుబాతి, నశ్మగర్భంబున హీరంబు నెలవున, విమతభృజ్జఠరంబునఁ దీక్ష్ణఘృణిమాద్రిని విలీనుం డై, మహానిష్ఠాగరిష్ఠత న్నించిన తాపసుం డగు నాతాపసుని బ్రహ్మరంధ్ర పథంబున యోగజన్మ యగు నమ్మహాకృపీట జన్మ యుదయంబు నొంది, సకల జగద్భస్మీకరణదక్షిణం బగుచు విజృంభింపఁ, దత్క్షణంబ బుభుక్షుప్రముఖు లగు హవి ర్భుక్కులు రూక్షం బగు నాయాశుశుక్షణి సైపఁ దక్కులు గాక, దక్షవక్త్ర నీక్షించి- యోహేమకుక్షీ! మమ్ముఁ గటా క్షించి క్షేమం బొసంగుము. లేకున్న నీక్షణంబ కల్పక్షయం బయ్యెడు నని సంక్షోభంబున న్వేడ, నయ్యెడ నత్తమ్మిగద్దియ యొడయండు సపరివారుండై వాని దండకేఁగి యాతనిఁదో ఱుత సింహాసంహానునిఁ జేసి, నీగోరిన వరంబు లిచ్చెదను. లే లెమ్ము, వేఁడు మని యతండ యాతనిఁ దద్దయు నర్థించె.

అసురుఁ డబ్రహ్మచే దుస్సాధ్యంబు లగు వరంబులఁ గొనుట.

అంత సద్దైతేయవనవసంతుం డనయ మ్మగు వినయ మ్మనుసొమ్ములకు నిమ్మగునెమ్మనంబున నానందంబున సొమ్మసిలి, యుచితరీతుల నతని సత్కరించి, యోవిరించీ! సం చిత సమంచిత తయాచంచచ్చేతస్కుండ వై నీ వర్నిలి వర్నంబు సేయ సమకట్టితి వేని, నాక్రచ్చు విచ్చి యాచిం చెద. అయ్యమరుల నెవ్వరులఁ దత్ప్రభవ విశేషంబుల మను జుల దనుజనులఁ దములం దినంబులఁ దాండంబుబు శార్ఙ్గం బులు వాయసంబు లగు ప్రహారణమ్ములఁ బలువిధమ్ము లగు నైరమ్మదమ్ములఁ దక్కినజంతువుల నండజ ప్రముఖసత్వ

ప్రకాండమ్ములఁ బుండరీకహర్యక్షప్రభృతి నానాభూతమ్ము
లఁ దొసఁగు బొసఁగని యాయువును, మఱియు మదీయ సం
కల్పంబులకు వికల్పతవిఘ్నలతాకల్పంబైన నవికల్పప్రతా
పతల్పంబుల నల్పంబులుగాఁ గల్పంబులంబోలి సకలసిద్ధుల
సంపాదించుమహిమంబు దయసేయఁగదవే యని వేఁడె. అంత
నవ్విశ్వతేజసుం డీవరంబులు వీని కీఁడఁ దసయండంబులకు
మగుడఁ బీడ వాడవుగఁ బాడవు నని మది నెఱింగియు, 'జీవ
న్భద్రాణి పశ్యతి' యను నయం బనుసరించి యయ్యెడ నల
జడి నడఁగింపఁదలంచి, వాఁడు గోరినవరంబు లన్నియు నిచ్చి,
మెచ్చుగ హితంబులు సెప్పి, తనచక్కికి నెచ్చరిక విచ్చేసె.

హిరణ్యకశిపుండు లోకంబుల నెల్ల బాధించుట.

అంత నాదైతేయనాథుండు శ్రీపర్ణతర్ణకవితీర్ణవరసంపూర్ణ
సత్త్వుఁడగుచు, పూర్ణంబుగ గోకర్ణవరభోగ సమాభోగ భీకర
కరవిక్రమంబున త్రివిక్రమాగ్రజప్రముఖ బర్హిర్ముఖులబర్హి
ర్ముఖులఁ జేసియు, పౌనఃపున్యంబున ననన్యసామాన్యదైన్యాశ్రి
తులఁ జేయుచుండె. మఱియు సకల సాధువులకుఁ దాపజ్వరంబు
కరణి, నయనాంతర ప్రవిష్టకటుశలాటురజంబు చాడ్పున, హృద
యనిఖాతవిషమయభల్లశల్యంబుతోఁ దుల్యంబుగ, దుస్సహం
బులగు దుఃఖంబులఁ జేయుచుండె. అంత గర్భస్థానావస్థానతావ
స్థయందు నత్యాస్థ పవిత్ర్యుద్దేశ్యకంబు లగు జేజేల జడదారి
యుపదేశంబు లాలించినవాఁడు గాన, నాజని వినీతవర్తనుఁ
డగుచు, శ్రీరమణీరమణ చరణ రమాశరణ సేవాభరణ నిపుణ
గణనీయ మానసుం డై, విమలజ్ఞానధీప్రహ్లాదుఁడగు ప్రహ్లా
దుం డను కుమారుండు, సంత్యక్తనిజ కులాచారుం డై



యుండె. అతనితండ్రి యగు హిరణ్యకశిపుఁ డక్కుండలీంద్ర
శయనుండు దొల్లి తనయనుజుని దండించినవాఁడు గావున,
నప్పురుషోత్తముండు తనకు దండనీయుం డని మెండుగ గండు
విఱాఱి మండిపడుచున్నవాఁడుగాన నక్కుమారశిరోమణిని
మున్ను బహువిధంబుల మాధవసేవావృత్తంబున మరల్చె.
అమ్మహామహిముండు స్వరూపసిద్ధానిరుద్ధానిరుద్ధాస్పదభక్తి
యుక్తుం డగుటం జేసి, రక్షఃప్రభవత్వంబు దెలుపుటకుఁ బోలె
గురువచనంబు లగురువచనంబులఁ జేసె.

హిరణ్యకశిపుండు ప్రహ్లాదుఁ బెక్కురీతుల బాధించుట.

పదంపడి యద్దనుజకుంజరుండు గడుఁ గనలి, కొడుకుఁ
జంప జతనం బొనరించి, మించినమచ్చరంబుతో నొకపరి
గొంకనిబింకంబులతోఁ బొంకంబులఁ బాలుచులంకెలచేత
శూలంబులఁ బొడిపించు. మఱియు నొకమఱి నుగ్రగ్రాహ
దుర్గ్రాహంబు లగు మహాప్రవాహంబులఁ బ్రగ్రహంబులం గట్టిం
చి, నిగ్రహపరుం డై విగ్రహంబునఁ ద్రొబ్బించు. ఒకసారి
నానల వాసంబు సేయు సామజసమూహంబు రావించి, దాని
యజ్జల నతనిబొజ్జఁ ద్రొక్కించు. ఒక్కతూఁకున సముద్గీర్ణగర
ళానల హేతిప్రాతకరాళవ్యాళ పాళికలఁ గఱపించు. ఒకవిడుత
మెండుగ నుండుకొండలపై నెక్కించి క్రింద నుండు గండు
బండలమీఁదఁ బడఁ ద్రోయించు. ఒకతేపఁ బలువిధంబు
లైన వహ్న్యాది యంత్రంబుల తంత్రంబులకుఁ బాలు సేసె.

ఒకమాటు వాటంబుగఁ బట్టించి, నిమ్మవాటంబుగఁ
గట్టించి దండిగ దట్టించి, జన్నంబున విశసనీయం బగు పసు
వునుం బోలె విచ్చి లెక్కచే మిక్కుటంబు లగు దారంబు

ప్రకాండమ్ములఁ బుండరీకహర్యక్షప్రభృతి నానాభూతమ్ము లఁ దొసఁగు బొసఁగని యాయువును, మఱియు మదీయ సంకల్పంబులకు వికల్పతవిఘ్నలతాకల్పంబులైన నవికల్పప్రతాపతల్పంబుల నల్పంబులుగా కల్పంబులంబోలి సకలసిద్ధుల సంపాదించుమహిమంబు దయసేయఁగదవే యని వేఁడె. అంత నవ్విశ్వతేజసుం డీవరంబులు వీని కీడఁ దనయండంబులకు మగుడఁ బీడ వాడవుఁగఁ బోడవు నని మది నెఱింగియు, 'జీవన్భద్రాణి పశ్యతి' యను నయం బనునయించి యయ్యెడ నలజడి నడఁగింపఁదలంచి, వాఁడు గోరినవరంబు లన్నియు నిచ్చి, మెచ్చుగ హితంబులు సెప్పి, తనచక్కికి నెచ్చరిక విచ్చేసె.

### హిరణ్యకశిపుండు లోకంబుల నెల్ల బాధించుట.

అంత నాదైతేయనాథుండు శ్రీపర్ణతల్పకవితీర్ణవరసంపూర్ణ సత్త్వుఁడగుచు, పూర్ణంబుగ గోకర్ణవరభోగ సమాభోగ భీకర కరవిక్రమంబునం ద్రివిక్రమాగ్రజప్రముఖ బర్హిర్ముఖులబర్హిర్ముఖులఁ జేసియు, పౌనఃపున్యంబున ననన్యసామాన్యదైన్యాశ్రితులఁ జేయుచుండె. మఱియు సకల సాధువులకుఁ దావజ్వరంబు కరణి, నయనాంతర ప్రవిష్టకటుశిలాటురజంబు చాడ్పున, హృదయనిఖాతవిషమయభల్లశల్యంబుతోఁ దుల్యంబుగ, దుస్సహంబులగు దుఃఖంబులఁ జేయుచుండె. అంత గర్భస్థానావస్థానతావస్థయుండు నత్యాస్థ సవిత్రుద్దేశ్యకంబు లగు జేజేల జడదారి యుపదేశంబు లాలించినవాఁడు గాన, నాజని వినీతవర్తనుఁడగుచు, శ్రీరమణీరమణ చరణ రమాశరణ సేవాభరణ నిపుణ గణనీయ మానసుం డై, విమలజ్ఞానధీప్రహ్లాదుఁడగు ప్రహ్లాదుం డనుకుమారుండు, సంత్యక్తనిజ కులాచారుం డై-



యుండె. అతనితండ్రి యగు హిరణ్యకశిపుఁ డక్కుండలీంద్రశయనుండు దొల్లి తనయనుజుని దండించినవాఁడు గావున, నప్పురుషోత్తముండు తనకు దండనీయుం డని మెండుగ గండు మీఱి మండిపడుచున్నవాఁడుగాన నక్కుమారశిరోమణిని మున్ను బహువిధంబుల మాధవసేవావృత్తంబున మరల్చె. అమ్మహామహిముండు స్వరూపసిద్ధానిరుద్ధానిరుద్ధాప్పద భక్తియుక్తుం డగుటం జేసి, రక్షఃప్రభవత్వంబు దెలుపుటకుఁబోలె గురువచనంబు లగురువచనంబులఁ జేసె.

### హిరణ్యకశిపుండు ప్రహ్లాదుఁ బెక్కురీతుల బాధించుట.

పదంపడి యద్దనుజకుంజరుండు గడుఁ గనలి, కొడుకుఁ జంప జతనం బొనరించి, మించినమచ్చరంబుతో నొకపరి గొంకనిబింకంబులతోఁ బొంకంబులఁ బొలయులం గెలచేత శూలంబులఁ బొడిపించు. మఱియు నొకమఱి నుగ్రగ్రాహ దుర్గ్రహంబు లగు మహాప్రవాహంబులఁ బ్రగ్రహంబులం గట్టించి, నిగ్రహపరుం డై విగ్రహంబునఁ ద్రొబ్బించు. ఒకసారి నానల వాసంబుసేయు సామజసమూహంబు రావించి, దాని యుజ్జల నతనిబొజ్జః ద్రొక్కించు. ఒక్కతూఁకున సముద్గీర్ణగరళానల హేతిప్రాతకరాళవ్యాళ పాళికలఁ గఱపించు. ఒకవిధుతె మెండుగ నుండుకొండలపై నెక్కించి క్రింద నుండు గండు బండలమీఁదఁ బడఁ ద్రోయించు. ఒకతేపఁ బలువిధంబు లైన వహ్న్యాది యంత్రంబుల తంత్రంబులకుఁ బాలు సేసె.

ఒకమాటు వాటంబుగఁ బట్టించి, నిమ్కవాటంబుగఁ గట్టించి దండిగ దట్టించి, జన్నంబున విశసనీయం బగు పసువునుం బోలె విచ్చి లెక్కచే మిక్కుటంబు లగు దారంబు

లుదారసత్త్వలచేఁ గప్పించె. ఒకతూరిఁ బుడమిలోఁ దుగఁద్ర
వ్వించిపాతించె. ఇట్లు రక్కసు లైనఁ జేయంవగని యుపాయం
బులఁ గుమారుని మారణంబునకై యన్నియుఁ జేసె నన్నియు
విరక్తవిషయంబులైన విలాసంబులంబోలి వంధ్యంబు లయ్యె.
కాని యయ్యుపాయ ధారాపరంపరలవలన నమ్మహాభాగవత
శిఖామణి, శ్రీరమణీ రమణానుగ్రహ ప్రాగ్రహార పుండరీక
గోపాయితుం డగుట, నించుక యైనఁ దదీయవేదన నెఱుఁ
గఁ డయ్యె.

అంతట నైన, మెయిపుట్టువు, జుట్టు కైదువదారి యక్క
టికంబునఁ బట్టి యి ట్టున్నవాఁ డని గట్టిగఁ దెలియనోపక,
తాఁ జేసినట్టి గొందలంబు లన్నియు నందంబు సెడి చిందరవం
దర లగుచు, రతనంపుదివ్వెను మాయింప నింపొందఁ బొందు
పఱచిన వలువతుదివిసరుట లగుటఁగానక, వేమాఱు సారెలు
నిబ్బరంబునఁ బ్రబ్బుగెబ్బున నుబ్బి యలమబ్బులు గుబ్బలిఁ
మీఁదఁ గుఱియు వారి ధారల కరణి, నిక్కంబుగ లెక్కల
కెక్కలు గాని యక్కజంపుకారియల మారియుంబోలి వెల
యించియు, నక్కొమరుని నొక్కింతయుఁ గొరంతఁ బంతం
బున నైన నొనరింపఁ బిగువుమాలి, విసికి వేసారియు, నొక
సారి యొక్క ప్రొద్దున నత్తనూజుని రావించి, యనార్జవదు
ర్జన కార్యంబు లగు తర్జనంబులచే గర్జిల్లుచు, నోరీ యొడలు
కాంద్రు లందఱు నన్ను దయ్యం బని నెయ్యంబునఁగొ
ల్తురు. నీ వొక్కఁడవ నాయానతి నలుసుఁ జేసెదవు? నన్ను
నెల్లిదంబు పా టొనరించుటకు నెవ్వండేనిఁ గలండో? యని,
నేనుమున్ను పెక్కుమాఱులు దిక్కుల వెక్కసంబుగఁ దిఱి
గిన, నొక్కండైనఁ గానరాఁ డయ్యె.

## అసుర హరింజూపు మని ప్రహ్లాదుని నిర్బంధించుట.

కావున మనసంతునకు వింతగ వంతలుసేయు వలంతి
యగునీయేలిక యెక్కడ నుండు? వక్కాణింపు మనిన, నావల
మురిదారిబత్తికాఁడు దన యబ్బకు, నుబ్బుచు గబ్బితనంబున
ని ట్లనియె— ఓయప్పా! విప్పి సెప్పెద మప్పితంబుగ నాలిం
పుము. ఆకసం బంతట నెట్లు నిండియుండు, నట్ల సకల జగ
న్నాథుం డగు నా రమానాథుండు నిజమూర్తివైభవ విశే
షంబునఁ గ్రిక్కిరిసి యున్నవాఁడు. అయిన నమ్మహానుభా
వుండు కరణత్రయంబునఁ దన్ను సేవించువారలకు సుహితా
కృతి నెల్లెడల ముంగల నుండు. త్రుక్కునఁ ద్రొక్కంబడి
చక్కఁగఁ దన నిక్కువం బెఱుంగని ముక్కడులకుఁ జీఁకులకు
గోకారింబోలి కానరా కుండు! అంతియ కాని, మఱి
యెద్దియు లే దని విన్నవించుచున్న, నాకనకకశిపుండు కుమా
రవరున కి ట్లనియె.

ఓరీ! పలుమాఱులు నీచేత సర్వవ్యాపిత్వ సర్వాంతర్యా
మిత్వ కర్తృత్వాది గుణంబుల కాశ్రయుం డని వక్కాణిం
పఁబడు నావిష్ణుఁ డట్టివాఁడేని, నిమ్మోనలమొగసాల మొక
రంబునఁ గానుపింపుము. అట్లేని నాదిట్టతనంబు నీకట్టెదురఁ
గనుపట్ట నాపట్టి నిట్టట్టులఁ గదలకుండఁ బట్టి నిట్టూర్పుల
కైనఁ బట్టుగాకుండ, నిప్పట్టున దట్టించి కొట్టకొనకు దాని
మట్టగించి నాకలోకేశ్వరత్వంబు బట్టబయలుగఁ గట్టిసేసెద.
కా కున్న నీబెడిదం బగు పడిదంబున నీమెడ తుండెంబు
లొనరించి, యన్నల్లచే నిప్పుడమిఁ దడపెద, నని కడుఁగరాళం
బగు కరవాలంబు చేత నంకించి, యుంకించుచు, నిజచపేట

పరిస్ఫుటిత దిక్తటకరటిఘటా పటుతర కటకటారవం బగునట్టి చేతఁ గొట్టె.

### నృసింహరూపంబున శ్రీహరి యావిర్భవించి హిరణ్యకశిపుఁ ద్రుంచుట.

అంతకుమున్న స్వైకనాథసనాథ తద్భక్త ప్రతిపాదితార్థ రాద్ధాంతీకరణ బద్ధాంతఃకరణుం డగుచు, వర్షంబులయుం దాత్మకరణి, చతురాది గోళంబులఁ గరణంబుల బాతి, యావత్ప్రమేయప్రచయాంతర్గతుం డై యుండుటం జేసి, యాజగన్నాయకుండు సకలసుశీలఖలకమలకు వలయువలయ విలయీకరణ ఖరఘృణిగణనీయ పుణ్యశ్రవసుం డగు నావిష్టర శ్రవసుండునుం దత్క్షణంబ యద్వ్రేటున దానిఁ బగిలించి కొని, ధూమప్రభవ గర్భంబున భిదిరంబు చాడ్పున, క్షితిభృత్కుక్షి వలన నాకరవిశేష ప్రభవ వహ్నికరణిని బయలనురికి, బెగడుఁబొడమ నదలించుచు, నాయసురం బట్టి, తొల్లి నలువ యొసంగిన వరంబులు దొసంగులు గాకుండ, బవలును జేఁతిరియుఁగాని, మునిమాపున, మానిసియు మెకంబునుఁ గాని నరహరిరూపంబున లోనికి వెలికెంకియుఁగాని కొలువుకూటంపు దారంపునడుమ, మిన్నును మన్నునుఁ గాని కురువు చోటున నసురరులను వాని పెఱలునుంగాని గోరుల, సకల ప్రాకృతపదార్థవిలక్షణుం డగు నప్పరమేశ్వరుండు, బెబ్బులి యుబ్బిగొబ్బున నబ్బసవుని ప్రీల్చుచందంబున, సక్కండల దిండుల దండిమగండను నయ్యాఖండల విరోధి వేదండంబును దండించి, దండధరునండకుఁ బనిచె. మఱియును తొల్లి తేటి యొల్లవింటిదంటయొక్క కతంబునఁ దనరాణి సమాధిసంధుక్షితంబగు నాశుశుక్షణిఁ దగిలి యొడలువిడువ నాసతీస్వామివిరాగతఁజెన్నొంది తపంబు సలుపు వేళ నమ్మహాదేవుని నియమంబునకు మహేంద్రప్రేరితుం డై బన్నంబుసేయఁబూని,పదంపడి యన్నళికాస్త్రునిచే నసమదృష్టిఁ జూడంబడి తనయొడలు వెలిమిడికినందఁజేసె. కాన నెట్టిదిట్టలకును స్వపరతారతమ్య విచారంబులెల్లతఱిఁ బరికింపఁదగి యుండును.



### —కామరాగాదిదోషముల నుగ్గడించుట.—

జవ్వనంబునంబుట్టు నక్కటిక చీకటి సాజంబునన బెట్టిదం బగుచు, వేయిచేతులవలంతికైనను పోఁగొట్ట నలవిగానిది రతనంపుదివ్వెలకైనను సమయింప వీలునొందనిది. ఇఁక నేమన్నను మేలుకొంటనంటినవంటచేతఁ బ్రతిభాప్రదీపైక వివర్త్యం బగుకలిమివలనఁ గలుగుమదంబు మిగులఁ బెట్టిదం బగుట నొక్కెడ నేని ముదిమినైనఁ గానదు. అతినిశితం బగు మరునికాకఁ బోనార్ప నెల్ల చల్లని సరుకులును జాలవు. భోగజాతం బను మహావిషసేవనంబునఁ గలుగుమోహం బడంప నెట్టిమంత్రౌషధంబులును రిత్తలగును. రాగంపుపూఁత యెన్నిసారులు గడిగినను మేనిచాయంబోలి, పట్టువిడనిదియ. కలిమింగలుగు హాయి యనుబలునిదుర వేఁకువ నెఱుంగకుండును. కలిమితోఁబుట్టువును ననఁదోఁగు జవ్వనంబును, మానవతుల యుల్లంబును తేటకూటంబులఁ దనతట్టునకు లాగుటకు సుగంధబంధురస్యందమానమకరంద బిందుసందోహ మందిరసుందరస్తబకం బగు సలలితరామణీయకంబును, మానిసిపుట్టువుయు నను నాలుగును పోలికవాసిన గొడవలయోలి వీనిలోన నొక్కం డయ్యు నెట్టిగుణవంతునైన నెట్టన మట్ట

గింపఁ బెట్టిదం బగు. ఇంక వీటికూటమి యైనఁ జెప్పందగిన దెద్ది గలదు? ఈఁడు మొక్కలెత్తు మిగుల శాస్త్రీయధవళ కమలధారా నిర్ధౌత మోహమలం బయ్యును, రజోభిభవంబునఁ జేసి, సారెసారెకుఁ గలఁత నొందు.

అనపాయత మించు ప్రాయంబునఁ గోవాళ్లచూడ్కి యతివిశదం బయ్యును, రాగావృతం బగు సాజంబు జవ్వనంబునఁ జాల సంవర్ధిత రజోభరం బగుచు, సుడుగొట్టు పట్టినమనుజునిమనం బతిజీర్ణం బగుదళంబునంబోలి త్రిప్పుచుండును. విషయమరీచిక హృషీకంబులను కమలంబులను వినువు మనలింపక, కడుగొడవులకు నెలవగుచు, నొక్కయెడ నేని, నొక్కయెడ నుండనీకఁ ద్రిమ్మరింపించును. కాన జాణ లగువారు సాజం బగు నేస్తంబున, నెగ్గులగ్గులఁ దెలుపుటకు మీఁజోటరులఁ దనరినవార లగుచుఁ జూపట్టుదురు. నిసర్గవిశదం బగునాత్మయందు నిందుకాంతరత్నంబున నమృతకిరణ కిరణంబులఁ బోలి, యుపదేశగుణంబు లనాయాసంబుగ సారస్యంబు వెలయించును. బోధకునిబోధనంబు మిగులవిమలం బై, రసజ్ఞైకవిజ్ఞేయమధుర రసం బైనను, వారికరణి నభాగ్యుని జానుగులఁ దగిలి, వెతలఁ గలిగించు. వివేకవంతుని చెవుల సోఁకినఁ జిందంపు తొడవు గజరాజంబునకుఁబోలె యలరినసొమ్ముల నిమ్ముల నాతనిమోముకుఁ దద్దయు వెలుంగు మెలంగించును. నీవిందాకను కూటంబులవాళుల నంటని వాఁడ వగుటం జేసి, గఱపుటకు నిదియ యదనై యున్నది. పూముల్కితేని కోలలఁ గాయంబునఁ గాయంబులఁ జెంది యున్నవాని యుల్లంబునఁ ద్రోడల గఱపుటలు దట్టంబు



లగు చోటు లేమినిఁబోలి, యొక్కచక్కి నైన నిలువలేక తమ్మిమ్రాకుననుండు నీటిబొట్టులంబోలి, యప్పుడ జారిపోవుచున్నవి. సాధుజనోపదేశంబులు తెలవరు లగువారికి నుల్లంబునఁ దగిలి, యందలి మాలిన్యంబు సైతముఁ బోగొట్టుటకుఁ దగిన తానంబు కానఁ గృతావధానుండవై యాలింపుము.

## —ప్రభుత్వదోషముల నుగ్గడించుట.—

యేలికతనం బఖర్వగర్వాంధకారసంతతం బై, కానఁ దగిన యరతంబులఁ జూడనేరదు. రవణంబు లై రిత్తయగు గరువంబునఁ బొచ్చెంపుపిచ్చను హెచ్చించును. సిరి తొల్లి పాల్కడలి వలనఁ బుట్టునపుడు, పగడంపుతీవెలఁ దలిరులవలన రాగంబును, జాబిల్లి ప్రక్కవలనఁ దద్దయు వంకరతనంబును, హాలాహలంబువలన రిచ్చపాటును, నిక్కువీనులజక్కివలనఁ దత్తరంపుపాటును, మదిరవలన మదంబును, కౌస్తుభమణివలన నతికార్కశ్యంబును, బెక్కుకాలంబు గూడ నుండుటం బట్టి యాఁగొనంబుల నెట్టనఁ గట్టఁబడి యుండె. అట్టి సిరి యల్ల బాములకు లోఁబడి, మానప్రాణంబులయం దిచ్చఁ బోఁ బుచ్చి, యార్జింపఁబడిన దైనను, రక్షణభోగాదుల యందు మిగుల నిడుమలఁ బడఁజేయుచున్నది. విపులసారంబు లగు గుణపాశంబుల దిట్టంబుగఁ గట్టఁబడినదియును, గారడివానివలె నెవ్వరికిఁ దెలియరాక, మఱియొక్క చక్కినిఁ జూపట్టు బోఁగంపుగరితతీరునఁ దొలుతటిచెలిమిని తర్కింపదు. ఆర్యులఁ గనుంగొనదు. కులాచారంబుల మన్నింపదు. లగ్గనడతల నెగ్గులుగాఁ దలంచి మన్నింపదు. శాస్త్రమార్గంబుల

నవిటితనంబు నొందు. నిక్కంబు లెక్కింపదు. దుర్వ్యసన ప్రియులను ప్రియులఁగా నెన్నుచుండును. మఱియుఁ దొలుత రితఱివోలె ననదువెలుఁగులఁ జేయు. పండితుఁ గని మండుని కరణిఁజూడ నొల్లదు. గుణవంతునిఁ గని, గేలిసేయ నుద్యోగించు. సుశీలునింగని పాతకిపోలెఁ గనుమూయును. నటవిటచే టవిదూషక గాయకులఁ గని, మిక్కిలి వెక్కసం బగుచ కిన్నుండి యేతెంచినచుట్టలంబోలెఁ దద్దయుఁ గ్రొత్త లగు నయ్యోతీరులఁ జొప్పడు. ప్రేమరసంబుఁ గురియించు. ఇట్టిసిరిచేతఁ దొలుతఁబుట్టువుల నార్జించిన పుణ్యాభాసంబునఁ జేపట్టఁ బడినవారైన నొడయులు, స్వపరచక్ర సముద్భవంబు లగు భయంబులఁ గుందుచుందురు.

మఱియు వారు దుర్వినయంబుల కెల్ల నాశ్రయంబు లగుదురు. వీరలకుఁ బట్టాభిషేక సమయంబున నావర్జితంబులైన మంగళకలశధారాపరంపరలచేత దయ ఘనసారసారతరచందన చర్చానిర్ధౌతం బగు నత్తఱి వ్రేల్మిడిఁ బుట్టి నహంగచేతఁ బోలి, యుల్లం బతికలుషం బై యుండు. పురోధ గావించిన విధిసమ్మార్జనంబునఁబోలి, తాలిమియును పోఁగొట్టంబడు. పాగఁగట్టిన పట్టంబుచేత ముదిమితలంపు గప్పంబడును. తెల్లని దగు నెల్లిచేఁ బరలోకదర్శనంబు సాతంకం బై యుండు. సురటులవీవుల మొలకలెత్తు కరువలుల నాత్మ వెడలిపోవఁ జాలని వైనను, క్రమ్మగని నిగ్గుల నెగ్గులేని లగ్గులకు నాటపట్టు లగు గొనంబు లెల్లఁ దూలలేశంబులఁ బోలి, దూరంబుగఁ బాఱును.

కాన నిట్టిచెట్టగొనంబులఁ గడు బెడంగుల నలువు నీయేలికతనంబునఁ దద్దయు నేమఱికఁ జేయు జవ్వనంబునం దట్లు



వర్తించుటను జనులు గేలిసేయఁ జాలరో? సాధువులు గర్హింపరో? గురువు లవమానింపరో? సుహృజ్జనంబులు నిందింపరో? పండితులు దూషింపరో? కుచ్ఛితులు దరికి రా వెరతురో? వనితలు స్వాతంత్ర్యంబు గొఱుంగ కుందురో? లక్ష్మీసరస్వతు లెల్లెడల నినుఁ బాయ నొల్లరో? మహామంత్రసిద్ధి నొందినవానిఁ జూచిన బూచుల కరణి, మదాది వికారంబులు నెంతకుఁ జేరవెఱచునో? అట్లు శాస్త్రదృష్టి ప్రధానుండ వగుచు నిరుపమం బగు సుమాళంబున స్వభావ ధీరుండ వగుచు, శిబినలభరత భగీరథాది ప్రాచీనమహారాజ వర్తమానంబుల ననుకరించుచు, చిరకాలంబు ప్రతిష్ఠ నొందుము. వగఱశిరంబుల నాత్మీయపదశతచ్ఛదంబులఁ దేటికూటువులఁ గావింపుము. విందుల సన్నతులఁగా నొనరింపుము. పెక్కుతఱిఁ బరికించికాని నీయుల్లంబు పెఱలకు దెల్లంబు గానీకుము. స్వాశ్రితుల ననన్యాశ్రితులఁ జేయుము. ఎట్టివారైన నినుఁ జేఱవచ్చిరేని, తొలుత నీసడింపక యాదరించి, వారిమనంబుల సాజంబులఁ గని కాని నమ్మిక కిక్కలఁ జేయకుము. ఇట్లు నడచుచు, సకల మంగళంబులకుఁ భాజనంబ వగుచు, వర్ధిల్లు మనె.

ఇట్లు నుడివిన యాప్రగ్గడకన్నాకునకు నాహిరణ్యగర్భుండు గేల్మోగిచి, వినయావనతవదనుం డగుచు నిట్లనియె—ఓనాయనా! నీయుపదేశం బమృతంపువృష్టిఁబోలి యవివేకావగ్రహాక్రాంతం బగు నాధీవల్లికి జీవాతు వయ్యె. మఱియుఁ జండితనం బనుతిమిరంబుచే వంచితంబగు నాదృష్టికి సిద్ధాంజనం బయ్యె. సునిశిత మగు నీ రసనయను సీరణంబు హితోదితాంగంబు లగు జక్కని యక్కరంబుల

మిగులఁ జక్కఁదనంబు సొంపెక్క మక్కువతోడఁ జెక్క
నా హృదయంబు శిలాపట్టంబై యుండె నని నే నెంచెద.
నా జోతల గారవించి యిది యెల్లెడల నిట్లుండునట్లుగఁ గని
కరంబు సేయవే! యని యేడ్తెర వేఁడిన, నాతం డట్లగుఁ
గాక. నీ కెల్లతఱి శుభంబుల యగును, పొమ్మని వతనింబంచి
దానును సంతసంబున నుండె.

అంత నవ్వామ్కర విష్కిర పుష్కరాసనుండు పుష్కరాస
నుభంగి నిజప్రజాప్రజంబులలో నయ్యైచెవులఁ జేతరులకు
నయ్యైతఱిఁదత్తదుచిత ఫలంబులు నేమంబునఁ బెట్టుచు,బు
ష్కరచరాధినాథుం డయ్యు సంగుప్తగోత్ర జాతపతుం డగు
చు, ముష్కరులను నిష్కంబులఁ బాపుచుఁ బుష్కరంబు లగు
భోగంబులభోగవంతుల సెలవున విలసిల్లుచు, జలనిలయుండ
య్యుత్తమాధాముం డగుచు, సాధుభూనాథునిభంగి యర్హాత
నానావిప్రాశితానూన విభవుం డగుచు, ప్రతిసూత్రపతుం డ
గుట శూరత సంతతసువిహిత సర్వతోముఖ సాంగత్యుం డగు
టన శేషధర్మజ్ఞానంబును పద్మినీవిహారణవిత్తుం డగుట సరసాశ
యత్వంబును, విజ్ఞాత శారదానూన గుణుం డగుట నదూష్య
వైదుష్యంబును, శుభలక్షణంబగు నిజవీక్షణంబున నశరణ
మార్గణులకు సకలక్షణగణంబులును చాక్షుషావిషయ విష
యాంతరైక వరణంబులు గా నొనరించువాఁ డగుట నిష్కం
పానుకంపాసంపాదితంబు లగు సద్గుణంబుల కెల్లఁ దాన
యొక్క యిక్కయై, వెక్కురుతనంబుల మొక్కంబాలు పెక్కు
లగు చదువులనిక్కువంబులు సొంపెక్కఁ బరికించుచు, నొజ్జల
యుపదేశంబులఁ గాఁ దెలియుచు, సకల స్వదేశవాసిజనిమద
భివర్ణిత వర్తనుం డగుచు, నయ్యై యేలిక రాణులందుఁ దద్ద



యునడఁకువఁ గూడిన గారవంబున సారెసారెకు వారలకుఁ
దననడతల చొప్పు మెప్పు గాఁగ నప్పనంబుగ విప్పి చెప్పుచు,
[illegible]నసీయచేతశ్చింతల సచ్చికిత్సకుండు నిర్వ్యాధికిత్సిత రసాయ
నంబునఁ గదంబులంబోలి నిజసేవనంబున నడంచుచు, వారలఁ
జేజేలంబోలి గొలుచుచుండె

అంత నాపుషమియొషయని పడంతులు గడుపునంబడసిన
కొడుకుకంటెఁ గడు వినయంబున దండితనం బొప్పఁ దమ
యిచ్చలు వెచ్చువెనుగ నచ్చంబగు బత్తిని దముందొట్టుము
నగెనలు గాఁగఁ దియ్యంబులు వలుకుచుఁ గొలుచుచుండఁ
గొమరుండు పుట్టకుండె ననియెడి మెం డగు నడరుంగడలులఁ
గడ దిగనాడి, సంతనంబునం దనరిన సుమాళంబులఁ జవిఁగొ
నుచు నుండి, కొంత తఱికి నంపలి హాయికిఁ దృప్తిం గొని,
తమకొలంపు పెద్దలఁ జూడఁ గడు వేడుకఁజెంది, నిజసౌభాగ్య
హృత సకల మానసంబగుమానసంబునుకొలంకున నివాసంబు
సేయం గోరియమ్మంత్రితోఁ దమతలంపులఁ దెలిపి, సంతసిల్లి
నయాతనితోడంగూడి, తమ జతనంబున కడ్డవాట్లు నుడువు
నాహిరణ్యగర్భుని నెట్టకేలకు నిచ్చకంబుల నూరడించి, తమ
యిచ్చంజనిరి. పిమ్మట నాహిరణ్యగర్భుండును, వారి యెడబా
యుటఁదద్దయు నుల్లంబు విరియ వంతఁ జెందియుఁ, దెలవరి
[illegible] దాని సంరంభంబును నిరోధించి, యెప్పటి యట్లఁ
[illegible] వేదిచే నొప్పంగింపఁ బడిన చక్రవాకుఁడను మంత్రి
కళానిధిదనకు సంగాతిప్రగ్గడ గాఁగ, నాతనియనుమతంబునఁ
దద్రాజ్యంబుఁ బ్రాజ్యంబుగఁ బాలింపుచుండె.

—